
అధిక దిగుబడికి
అధిక
పోషణనిచ్చే
ఎరువులు ముఖ్యం
గ్రోమోర్
14-35-14
GROMOR
N-P-K
14 35 14
GROMOR
28 28 0
గ్రోమోర్
28-28-0
coromandel
gromor
చేనుకు చేవ, రైతుకు రొక్కం-గ్రోమోర్
AIYARS CF 479 TL
కోరమాండల్ ఫెర్టిలైజర్స్ లిమిటెడ్



లక్ష్మీ చిత్ర వారి
సత్యానికి సంకెళ్లు
కథ-స్క్రీన్‌ప్లే-దర్శకత్వం
కె.యస్.ప్రకాశరావు
నిర్మాతలు
సి.రామకృష్ణారావు-ఆర్.ఏకాంబరం
విజయ కంబైన్స్
VIJAYA
KalaMandir

# ఆంధ్ర సచిత్ర వార పత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 – 1972)
శుక్రవారం 15–11–'74
ఆనందనామ సం కార్తికమాస శు విదియ
సంపుటము . 68 సంచిక : 9

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

★

సంవత్సర చందా – రు 31–20 పై.
ఆరుమాసాల చందా – రు 15–60 పై.
విడిప్రతి వెల 55 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-3.


## విషయానుక్రమణిక

అట్టమీదబొమ్మ
నటి రీనా (వినోదిని)
(ఫోటో : ...... మోహన్)



# ఉత్తరాలు

### బొమ్మలో తప్పు

18 10 74 పత్రిక పద్మశ్రీ రామారావు, లతల ముఖచిత్రంతో చాలా ముచ్చటగా, ఆహ్లాదంగా వుంది ఇదే పత్రికలో కె ఎస్ వై పతంజలిగారు వ్రాసిన పది పైసలు కథకు గాను చిత్రించిన పదిపైసలనాణంమీద 1974 (నయాపైసే)అన్న హిందీమాట (ముద్రణ) ఉన్నది నయేపైసే ముద్రణ ఉన్న నాణములు వాడుకలో లేక దశాబ్దం దాటింది

ఎస్ పి రంగనాథం, (హుబ్లీ)

### కథలు

ఈ వారంలో ప్రచురించిన "పది పైసలు" కథ చాలా బాగుంది

వేమూరు భాస్కరరావు, (మద్రాసు)

* * *

11 10 74 సంచికలోని "దాగని విజం" కథ చదివాను కథ ఆసక్తిని కల్గిస్తూ ముందుకు సాగింది స్త్రీల తొందరపాటు నిర్ణయాలు అర్థంలేని భ్రాహలా మగవారిని ఎలా ఇబ్బందులకు గురి చేస్తాయో వివరించబడిన తీరు ప్రశంసనీయం.

పర్చా వాసుదేవరావు, (ఖమ్మం)

# హైదరాబాద్ నోట్ బుక్

## రమ్‌జాన్ పండుగ:

నెలరోజుల రంజాన్ ఒక్కపొద్దుల తర్వాత ఈదుల్‌ఫితర్ పండుగ నగరంలో ననవోత్సాహంతో జరిగింది మీర్‌ఆలం తటాకంతో పోటీచేస్తున్నదా లన్నట్లున్న మూడులక్షల మంది జనం మీర్ ఆలం ఈద్‌గాహాలో ప్రార్థనలు జరుపుతున్నదృశ్యం చూడడానికి, రంజాన్ నెలరోజులూ రంగ్‌బిరంగ్ విద్యుద్దీపాలంకరణం చూడడానికి రెండుకళ్ళు చాల వని ఎవరికైనా అనిపిస్తుంది మీర్‌ఆలం ఈద్ గాహాలో ప్రార్థనలను మవులానా మునీరుద్దీన్ సాహెబ్ ప్రారంభించారు ఈదుల్‌ఫితర్ పండుగ నాడు ప్రత్యేకంగా వండే షిర్‌ఖుర్మా పరమాన్నం కోసం ప్రత్యేకంగా పాలసరఫరా జరిగింది ప్రార్థన చేస్తున్న ఆ జనసందోహాన్ని చూచినప్పుడు, సంఘ ప్రార్థన, సంఘభోజనం ఐకమత్యం పటిష్టం కావడానికి ప్రధానమైన అంశాలని అందరూ గ్రహించడం అవసరం

## దర్శకుడు శ్రీ దాసరికి సన్మానం:

ఇటీవల రవీంద్ర భారతిలో డాక్టర్ సి నారాయణరెడ్డి అధ్యక్షతన సన్మానం పొందిన చలన చిత్ర దర్శకుడు శ్రీ దాసరి నారాయణరావు "నేను చిత్రరంగం నుంచి నిష్క్రమించేలోగా జాతీయాంతర్జాతీయ స్థాయిలో అవార్డు పొందే చిత్రంనిర్మించడానికి శాయశక్తులా కృషి చేస్తాను" అని ప్రకటించడం కళాభిమానులకు ఎంతో సమాశ్వాసనం కలిగించింది డాక్టర్ సి నారాయణరెడ్డి శ్రీ దాసరిని ఆంధ్రప్రదేశ్ సత్యజిత్‌రాయ్ అని ప్రశంసించడంలోను అతిశయోక్తి లేదు శ్రీ దాసరి ఆంధ్ర ప్రతిభను ప్రస్ఫుటంచేసే చిత్రాలు తీస్తారు తప్పద శ్రీ దాసరి దంపతులకు పూర్ణకుంభంతో స్వాగతమివ్వడం, సన్మాన సంచికను విద్యుచ్ఛక్తి మంత్రి శ్రీ రాజారాం ఆవిష్కరించడం, న్యాయమూర్తి శ్రీ కుప్పుస్వామి, పలువురు ప్రముఖ నటులు శ్రీ దాసరి నారాయణరావు శక్తి సామర్థ్యాలను ఉగ్గడించడం, రవీంద్రభారతి శ్రోతలతో కిటకిటలాడడం కన్నుల పండుగగా ఉంది

## "సిగ్గు సిగ్గు!"

నగరంలోని కళాశాలల వాలికలు అక్టోబర్ 19న విశ్వవిద్యాలయం వెళ్ళడం చూచిన వారికి మరే సమ్మె జరుగుతుందో అని గాభరా కలిగింది కాని, 'పిల్లలను పీడించే పోకిరీలపై చర్యలీను కోవాలని నిరసన తెలుపడానికి వెళ్ళారని తెలిసి తల్లిదండ్రులు సంతోషించారు ఇటీవల ఈ పోకిరీ పనులు ఎక్కువగానే జరుగుతున్నాయి బస్సుస్టాపులలో, బస్సులలో ఆడపిల్లలు ఇలాటి బాధలు పడుతూనే వున్నారు వైస్‌చాన్సలర్ ఒసముందు ప్రదర్శనలు








ఉత్తరప్రదేశ్ గవర్నర్
డా. ఎం. చెన్నారెడ్డి గారు

"సిగ్గు సిగ్గు! పిల్లలను పీడించే వారిపై చర్య తీసుకోవాలి!" మొదలైన నినాదాలతో మహోద్రేకంగా జరిగింది దీనిని అభ్యుదయ మహిళా సంఘం, అభ్యుదయ ప్రజాస్వామిక విద్యార్థి సంఘం ఏర్పాటుచేశారు.

**గవర్నర్ చెన్నారెడ్డి :**

డాక్టర్ ఎం చెన్నారెడ్డి ఉత్తరప్రదేశ్ గవర్నర్ కావడం నగరవాసులకు ఎంతో ఆనందం కలిగించింది చెన్నారెడ్డి ధైర్యానికి, తను నిజంగా నమ్మినదానిని ఎందరు అడ్డు తగిలినా ఆచరించగల మనోదార్ఢ్యానికి, చేసిన పొరపాటును ఒప్పుకొనే వివేకానికి, జీవితమే ఒక ప్రయోగశాల గనుక ప్రజోపయోగమైన పథకాలను ఎవరు సూచించినా ఆచరణలో పెట్టి ప్రయోగాత్మకంగా పరిశీలించి చూద్దామనే పట్టు విడుపులకు పెట్టినదిపేరు ఇదివరకే పలువురు తెలుగు బిడ్డలు ఉత్తరప్రదేశ్ గవర్నర్లలో తెలుగు వారి సత్స్వభావాన్ని పరరాష్ట్రాల వారికి పరిచయం చేసి పేరు పొందారు చెన్నారెడ్డి ఆ పేరును మరింతగా వెలిగేట్టు చేస్తారనడంలో సందేహంలేదు ఆ సూచనలు, ఆయనకు గాంధిభవన్‌లోను, ప్రెస్ క్లబ్బులోనూ, ఇతరత్రాను జరిగిన సన్మానాలలో ఆయన ప్రసంగించిన దానినిబట్టే కనిపిస్తున్నాయి

**ఉప శ్రుతి :**

"చూశారా! మైసూరు మంత్రులు మంత్రివర్గ సమావేశానికి ఆలస్యంగా పోతే నిమిషానికి రూపాయి జుల్మానా చెల్లిస్తున్నారట మన మంత్రులు దీనిని అనుసరిస్తే బాగుండును" అన్నాను "బలే అన్నారండీ! మన మంత్రులు వందల కొలదీ ఫైను చెల్లించవలసి వస్తుంది అలాటి వెర్రిపను లు చేస్తారా?" అన్నాడు మిత్రుడు

—తిరుమల రామచంద్ర

# ఫాలాక్షుని డైరీ

**క్రిమిసంహారిణా ! మానవసంహారిణా !**

బెళ్గాంకు చెందిన కాపినాల్ గ్రామంలో వో డెబ్బయ్యయిదేళ్ళావిడ వంటవండి, అందులో వుప్పుకు బదులు పొరపాటున "క్రిమిసంహారిణి" పొడరును వేసి, తన అయిదుగురు మనుమలకూ పెట్టి తానూ తిన్నదట తత్ఫలితంగా యీ ఆరుగురూ చనిపోయారట ఇది నాలుగో తేది విపరీతం.

**దొంగ బంగారంలో లాభం**

దేశంలో ఏటా నూరు కోట్ల రూపాయల విలువచేసే దొంగబంగారం మారకం జరుగుతోందట డెబ్బయి వేల కిలోల బంగారం దేశంలోకి వస్తోందట 1973 ప్రాంతంలో యీ దొంగ బంగారం వ్యాపారులు విపరీతంగా లాభాలు చేసుకున్నారట 1970 లో విదేశాలలో పది గ్రాముల బంగారం తొంభయి రూపాయలుంటే మన దేశంలో రెండు వందల రూపాయలుండేదట ఒక కిలో బంగారం అమ్మితే పద్నాలుగువేల రూపాయలు లాభం వుండేదట బాపురే .

**ప్రాణాలు తీసిన హోటలు సాంబారు**

హోసన్‌లో వో నలుగురు విద్యార్థులు చేరి, అన్నం వండుకుని, సాంబారు, కూరా వో హోటలు నుంచి (అక్టోబరు 3) తెచ్చుకున్నారట తిన్న కాస్సేపటికి వాంతులు చేసుకుని, ఆసుపత్రిలో చనిపోయారట ఈ నలుగురిలో ముగ్గురు పి యు సి. విద్యార్థులట ఒకతను యస్సెల్సీ విద్యార్థిట ఆసుపత్రికి తీసుకు వెళ్ళగానే ఏ డాక్టరూ వారిని చూడలేదట ఆ కారణం వల్ల డ్యూటీలో వుండి, వీరిని అనక తనిఖీ చేసిన డాక్టరును సస్పెండు చేశారట

**ఎంప్లాయిమెంటు ఆఫీసర్ మరణం ఎలాంటిది !**

చిదంబరానికి చెందిన 29 ఏళ్ళ భాస్కరన్ అనే ఆయన తన గదిలో చనిపోయి వున్నాడట (4 వ తేదీ సాయంత్రం) ఆయన జిల్లా ఎంప్లాయిమెంట్ ఆఫీసరట అంతేగాక అన్నామలై విశ్వవిద్యాలయానికాయన ఎంప్లాయిమెంట్ ఇన్‌ఫర్మేషను, గయిడెన్స్ బ్యూరోలకు డెప్యూటి ఛీఫ్‌ట 4 వ తేదీన తనకు తలనొప్పిగా వుందని తోటి వారితో చెప్పి అర్జంటు పనులుంటే సాయంత్రం తన లాడ్జికి రమ్మని చెప్పి వెళ్ళి పోయాడట చూస్తే సాయంత్రం రూములో చనిపోయి వున్నాడట

**టిక్కెట్టులేని సినిమా ప్రేక్షకులు !**

వినోదపు పన్ను శాఖవారు పోయినెల యిరవైయ్యొనిమిదో తేదీన హర్యానాకు చెందిన కాపేడన్‌లోని వో సినిమా హాలు మీద విరుచుకు పడి చూసేసరికి హాల్లో సినిమా చూస్తున్న మూడొందల మంది ప్రేక్షకులలో ఏ ఒక్కరివద్దా కూడా టిక్కెట్టు లేదట టిక్కెట్లే అమ్మకుండా "అంతయూ మన మేలునకే"గా హాలు యజమాని డబ్బులు తీసుకుని హాల్లోకి జనాన్ని వదులుతున్నాడటా హాలులో వాడె బ్రిల్లియంట్ బ్రెయిన్ హెజ్జీ !

**ప్రపంచంలో పెద్ద మనుషులున్నారా !**

ఇంగ్లాండ్ బార్న్స్లీకు చెందిన 50 ఏళ్ళ యువకుడు తాను గత ఇరవైయ్యేళ్ళగా ఏకధాటిగ ప్రేమించిన అమ్మాయి తనను నిరాకరించిందన్న కోపంతో తాను ఆమె కొరకు దాచిన 3,600 డాలర్లూ కోపంతో రోడ్డు మీదికి విసిరివేశాడట ఆతనో ట్రక్కులో వెళుతూ ఆ డబ్బు వెదజల్లేశాడట కోపం చల్లారాక పోలీసులవద్దకు పరుగెట్టుకు వెళ్ళి "సార్సార్ నా డబ్బు కొంచెం ఏరి, చుట్టుపక్కల వాళ్ళను అడిగి యిస్తారా" అని భోరుమన్నాడట పోలీసుల ప్రయత్నంతో 3,120 డాలర్లు దొరికాయట "అదృష్టవంతుడు చాలా మంది పెద్ద మనుషులున్నారు గనుక ఆ మాత్రమైనా దొరికింది" అందట పోలీసు అవునవును అదే యిక్కడయితే!

**పట్టుబడ్డ బంగారం !**

సెప్టెంబరు అయిదవ తేదీన ఆగ్రాలో సెంట్రల్ ఎక్సయిజ్ శాఖవారు 14 లక్షల విలువచేసే బంగారాన్ని పట్టేశారట 3 లక్షల కిమ్మత్తుచేసే బంగారు నగలను కూడా కైవశం చేసుకున్నారట పూనాలో ఆదాయం పన్నువారు పోయిన నెలలో పద్నాలుగుమందినుండి 12 లక్షల డబ్బు, బంగారు నగలను పట్టారట బొంబాయి శివాజీ పార్కు ప్రాంతానికి చెందిన ఒక ఇంటిలో ఆదాయం పన్నువారు చేసిన సోదాలో ఆ ఇంటి పూజా మందిరంలో బోలెడు బంగారు విగ్రహాలు దొరికాయట బంగారు దేవుళ్ళను వారు పట్టుకు ఎక్కా పోయారట— లోగుట్టు పెరుమాళ్ళ కెరుక గదా!

**జ్యూలు, జీసస్‌ను శిలువ వేయలేదుట !**

రోమను సామ్రాజ్యం మీద ఏసుక్రీస్తు గొరిల్లా యుద్ధం చేశాడనీ, గొరిల్లాలకు నాయకుడుగా ఉండి రాజ్యం మీద దండెత్తాడనీ, ఆ కారణం వల్లనే రోమన్ రాజ్య న్యాయవట్టం ఏసుక్రీస్తును శిలువ వేశారనీ, "ది ట్రూ ట్రయల్ ఆఫ్ జీజస్" అనే పుస్తకంలో జాక్సెన్ ఇస్సోర్నీ రాశారట జ్యూస్ (అదొక తెగ) జీజస్ దైవత్వాన్ని అంగీకరించలేదని, ఆయనను వారు దేవుని చేత పంపబడిన వానినిగా గుర్తించారని, కూడా ఆయన స్పష్టం చేశారట దీనివల్ల ఆయన ఏసుక్రీస్తు మరణంలో జ్యూసుకు ఏ విధమైన సంబంధం లేదని, వారు నిరపరాధులని ఆయన నచ్చచెప్పారట డాక్టర్ నాన్సిక్ అనే ఆయన ఇస్సోర్నీ రాసిన పుస్తకాన్ని తీవ్రంగా విమర్శిస్తూ "న్యూ టెస్ట్‌మెంట్"ను కించపరుస్తూ రాసినందుకు ఇస్సోర్నీని నిందించారట పాపం పురాణాల్లో కూడా లేని సమస్యలు తెలు !

# * దీపావళి కొక తీపి పిండివంట *

## తేనె తొనలు

మినపప్పు (పొట్టుది) పావు కే. జీ, తెల్ల బెల్లము అర కే జి, డాల్డా లేక మంచినూనె అర కే జి, యాలకులు 4, పచ్చ కర్పూరం కొద్దిగా, చిటికెడు వుప్పు

మినపప్పు రాళ్లు లేకుండా బాగు చేసి, 4, 5 గంటల ముందుగా నీళ్లలో నాన పొయ్యాలి బాగా నానిన తర్వాత పొట్టు తీసి, శుభ్రంగా కడిగి పప్పుని ఒక బుట్టలో పోసి, నీరు ఒడేటట్లు చెయ్యాలి తర్వాత పప్పులో చిటికెడు వుప్పు రుచికొరకు వేసి, రోటిలో వేసి నీళ్లు పొయ్యకుండా చెయ్యి మాత్రమే తడి చేసుకుంటూ గట్టిగాను, మెత్తగాను రుబ్బుకోవాలి రుబ్బేటప్పుడు నీరు పోస్తే పిండి పలచన అయి నూనె ఎక్కువగా పీల్చేస్తాయి ఈ రుబ్బడం ఎంత మెత్తగా, ఎంత గట్టిగా వుంటే తేనె తొనలు అంత మృదువుగాను, ఎక్కువగాను వస్తాయి కుంపటి మీద, వెడల్పాటి స్టీలు గిన్నెలో అర కే జీ బెల్లంలో ఒక గ్లాసు నీళ్లు పోసి పెట్టాలి లేత పాకం వచ్చే వరకు వుంచాలి ఆ పాకం లోనే యాలకులు, పచ్చ కర్పూరం మెత్తగా పొడుం చేసి వేసుకుని, గిన్నెని కుంపటి సెగ తగిలేటట్లుగా క్రిందికి దింపి పెట్టుకోవాలి

తర్వాత కుంపటిమీద మూకుడు పెట్టి డాల్డాగాని, నూనెగాని పోసి, బాగా మరిగిన తర్వాత, లావుగా వచ్చే జంతికల గొట్టంలో, నిమ్మకాయంత మినప్పిండి నీళ్ల తడి చేసుకుని పెట్టి, నూనెలో చిన్న సైజు జంతిక మాదిరిగా వెయ్యాలి ఎంత చిన్నవిగా వేసినా, నూనెలో వెయ్యగానే పొంగి బాగా పెద్దవిగా అవుతాయి దోరగా వేగేక అట్లకాడతో తీసి, క్రిందదింపి వుంచుకున్న పాకంలో వేసి, పాకంలో బాగా మునిగేటట్లు చెంచాతో నొక్కాలి ఇంకొకటి వేగి తీసి పాకంలో వేసేదాకా మొదటిది పాకంలో వుంచి, ఇంకొకటి వేసే ముందు పాకంలో వున్న తేనె తొనని తీసి పళ్లెములో పెట్టుకోవాలి ఈ తేనె తొనలు జిలేబిల కన్నా గుల్లగా వుండి, పాకం బాగా పీల్చుకొని చాలా బాగుంటాయి ఇవి, ఎక్కువ రోజులు నిలవ వుండవు

— జి స్వర్ణ కుమారి

---

# వారఫలం

— మహేష్

15–11–1974 శుక్రవారం మొదలు
21–11–1974 గురువారం వరకు

**మేషం** — కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని మోసంచేయడానికి ప్రయత్నిస్తారు వృత్తిలో శ్రమ కలుగుతుంది వారం మధ్యలో ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు బంధువుల వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి

**వృషభం** — ఇతరులతో కలసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి సాటివారిలో గౌరవం లభిస్తుంది వారం మధ్యలో సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది వారం ఆఖరులో నూతన వ్యవహారాలు బాగుంటాయి స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి వ్యతిరేకమైన వార్తలను వింటారు

**మిధునం** — మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి సాటివారిలో మాటపట్టింపులు తగవు రావలసిన డబ్బు అందుతుంది ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి వారం ఆఖరులో మీరు వెనకకు తగ్గడమే మంచిది కాగలదు స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది ఆడంబరంకోసం వ్యయం జరుగుతుంది

**కర్కాటకం** — వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి మిత్రుల సహాయం లభిస్తుంది ప్రయాణాలు వాయిదా పడతాయి రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది వారం ఆఖరులో మీ ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయి స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి వినోద కాలాక్షేపాల్లో పాల్గొంటారు

**సింహం** — సామాన్యమైన పనులకు కూడా మీరు ఎంతో కృషి చేయవలసి వస్తుంది పుణ్య కార్యాలు చేస్తారు వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి అనవసరమైన సందేహాలు కలుగుతాయి స్త్రీలకు —ఆరోగ్యం బాగుంటుంది బంధు మిత్రులను కల్సుకొంటారు

**కన్య** — అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి సజ్జనసాంగత్యం లభిస్తుంది స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి ప్రయాణాలు వాయిదా పడతాయి ముమ్మందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధిస్తారు స్త్రీలకు— అనుకూలమైన వార్తలను వింటారు పుణ్యకార్యాలు చేస్తారు

**తుల** — మీ ఆలోచనలు ఫలిస్తాయి వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి వృత్తిలో సాటివారి పోటీతగ్గుతుంది వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది స్త్రీలకు —ఆరోగ్యం బాగుంటుంది సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది

**వృశ్చికం** — మీ కార్యక్రమాలు బాగుంటాయి వృత్తిలో ఆదాయం పెరుగుతుంది రావలసినడబ్బు అందుతుంది భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగుంటాయి సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి స్త్రీలకు —కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి ప్రయాణాలోచనలుచేస్తారు

**ధనుస్సు** — అనవసరమైన శ్రమ కలుగుతుంది సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది వారం మధ్యలో ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది వ్యాపారంలో నూతనావకాశాలు లభించగలవు ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు వినోదకాలాక్షేపాల్లో పాల్గొంటారు

**మకరం** — ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి నూతన విషయాలను తెల్సుకొంటారు వారం మధ్యలో ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి వారం ఆఖరులో తిరిగి అనుకూల పరిస్థితి యేర్పడుతుంది స్త్రీలకు —కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి

**కుంభం** — స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి వారం ఆఖరులో మీ కార్యక్రమాల్లో శ్రమకు గురికాగలరు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది దైవకార్యాలు నెరవేరతాయి

**మీనం** — వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది అనుకూలమైన వార్తలను వింటారు అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి సజ్జన సాంగత్యం లభిస్తుంది మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి స్త్రీలకు—వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు పుణ్యకార్యాలు చేస్తారు ●

# బుద్ధిమంతుడు

'మదన్'

"టు-లెట్" అన్న బోర్డు కనిపించగానే ప్రాణం లేచి వచ్చినట్లయింది ఉదయం నుంచి కాళ్లు పడేలా తిరిగి తిరిగి ఉన్న శ్రీధర్‌కి

"ఏమండీ" అంటూ మెల్లిగా తలుపు కొట్టాడు

"ఆ వచ్చా! ఎవరూ?" అంటూ తలుపు తీసి, అక్కడ నిలబడివున్న యువకుని నఖశిఖ పర్యంతం ఒకసారి పరిశీలించింది అన్నపూర్ణమ్మగారు అంతలోనే ఆమె బుర్రలోకి మెరుపులాంటి ఆలోచనొకటి వచ్చి, "ఏం నాయనా, ఎవరు కావాలి?" అంది

"అక్కడున్న బోర్డును చూచి వచ్చేనండి అద్దెకు ఏమైనా ఇస్తారేమోనని" అంటూ నసిగేడు శ్రీధర్

ముందతని కులం, గోత్రం అడిగి చదువుకుంటున్నాడో, ఉద్యోగం చేస్తున్నాడో అడిగి చివరకి "వివాహం అయిందా?" అని అడిగింది అద్దెకిచ్చేందుకు ఇవన్నీకూడా కావాలి కాబోలు దేముడా! అనుకుంటూ కొంచెం సిగ్గుపడ్తూ "లేదండి" అన్నాడు

అడగవలసినవన్నీ అయ్యాక, తనకు కావలిసిన సమాధానాలు రాబట్టుకున్నాక "ఆ ఎదురుగా కన్పించే ఔట్ హౌసే అద్దెకిచ్చేది రా నాయనా చూసుకుందువుగాని" అంది

ఆమె నోటివెంట ఏం వస్తుందో, మళ్లీ ఎక్కడ వేటకు బయలుదేరవలసి వస్తుందోనని భయపడ్తున్న అతనికి ఆమె మాటలు శ్రవణానందకరంగా విన్పించాయి ఆమె ముందు నడుస్తూంటుంటే ఆమె ననుసరించేడు

ఇల్లు బాగానే ఉంది గాలి, వెలుతురు బాగా వస్తున్నాయి అద్దె ఎనభై రూపాయలు ఆ మాటకొస్తే అసలా ఇంటికి ఎనభై రూపాయలు తక్కువే మారు మాట్లాడకుండా పర్స్‌తీసి "ఇదిగోనండి అడ్వాన్స్" అన్నాడు

"దానికేం తొందర" అంటూనే తీసికొని "సామాన్లూ, అవీ ఎప్పుడు తెచ్చుకుంటావు? ఈ రోజు మంచిదే"

"సాయంత్రం తెచ్చుకుంటానండి" అంటూ తాళంచెవి తీసికొని వెళ్లిపోయాడు

* * *

భర్త విశ్వనాథంగారు రాగానే "ఏమండీ! మన ఔట్ హౌస్ అద్దెకిచ్చేసానండీ" అంది

"ఎవరికేటిమి? ఎంతకిచ్చావ్?"

"ఎనభై రూపాయలకండీ" అని ఆవిడ అంటుండగానే "ఆ!" అన్నారాశ్చర్యపోతూ

"నేనేం వెఱ్ఱిదాన్ని కాదు కాలేజీలో లెక్చరర్ చాలా నెమ్మదస్తుడులా ఉన్నాడు" అంటూ ఆయన చెవిలో ఏదో గుసగుసలాడింది

"ఎలాగైనా నీది గట్టిబుర్ర" అనిమెల్లిగా నవ్వేరు

* * *

సాయంత్రం కాలేజీ నుండి వస్తున్న మంజులకి రిక్షాలోంచి పెట్టె, బెడ్డింగు, క్యారియర్ మొదలైన కొద్దిపాటి సామానుతో దిగుతున్న శ్రీధర్ కన్పించేసరికి చెప్పులు టకటక లాడించుకుంటూ కోపంగా తల్లిదగ్గర కెళ్లి "అమ్మా! స్టూడెంట్స్ కెవరికీ ఇవ్వద్దని చెప్పారు గదా!" అంది

"స్టూడెంట్ కాదే లెక్చరర్‌ట"

'ఎవరోఒకడు ఒంటరి వాడికివ్వద్దన్నానుగా'

"ఆ, నీమాట నీదేగానీ పిల్లా జెల్లా ఉన్నవాళ్లకిస్తే ఇల్లు పాడవటమే కాక మొక్కా మోడు కూడా ఉంచరు ఏమైనా అంటే దెబ్బలాడ్తారు" దాంతో మంజుల లోపలికెళ్లి పోయింది

* * *

విశ్వనాథం, అన్నపూర్ణమ్మగార్ల ఏకైక సంతానం, మంజుల వారికి డబ్బుకు కొదవ లేదు దాంతో మంజుల ఐశ్వర్యవంతురాలే కాకుండా అందం, తెలివితేటలు కూడా ఉన్నాయి వాటికి సమపాళ్లల్లో అహంభావం కూడాఉంది ఆ ఇంట్లో ఆమె మాటకి తిరుగులేదు ఇంటర్మీడియట్ పూర్తికాగానే ఆమెకు వివాహం చేసి కళ్లెదురుగా కూతురూ, అల్లుడూ చిలకా, గోరింకల్లా తిరుగుతూ ఉంటే చూడాలని కోరికగా ఉంది, అన్నపూర్ణమ్మగార్కి ఆమె ఉద్దేశ్యం చదువూ, సంధ్య ఉన్న బుద్ధిమంతుడైన కుర్రాణ్ణి చూసి, ఇల్లరికం ఉంచుకుంటే కూతురెప్పుడూ తన కళ్లెదురుగానేఉంటుందని, అటువంటిఅల్లుడి కోసం గాలించ సాగేరు, అన్నపూర్ణమ్మగారు అందుకు ససేమిరా ఒప్పుకోలేదు, మంజుల ఆత్మాభిమానాన్ని చంపుకొని ఇల్లరికం ఉండటానికంగీకరించే ఏ యువకుణ్ణీ చేసికోనని ఖచ్చితంగా చెప్పేం బి ఎస్ సి లో చేరిపోయింది అందుచేత ఆ ఉద్దేశ్యం మార్చుకోక తప్పలేదు పోనీ ఉన్న ఊళ్లోనే తమ అంతస్తుకు తగ్గ సంబంధం చేస్తే రోజూ కళ్లకు కన్పిస్తూ ఉంటుందని అనుకుంది

* * *

"ఓ సేవ్ మంజూ! మన వీధి చివర మేడ లేదూ?"

"ఊఁ ఎందుకు లేదూ కళ్లకు కన్పిస్తూనే వుందిగా"

"నే చెప్పేది విను అడ్డురాకు ఆ రిటైర్డ్ జడ్జీగారు లేరూ, ఆయన కొడుకును చూసావా?"

"ఆ చూసాను నిక్షేపంగా నిన్న కార్లో వెడ్తున్నాడే ఏమైందిటా పాపం!"

"చాల్లే చిన్నపాపాయిననుకుంటున్నావు ఆ వెక్కిరింతలు మానేసి నేనడిగిందానికి సరిగ్గా సమాధానం చెప్పు ఆ అబ్బాయి నీకు నచ్చేడా?"

"అదా నువ్వడిగేది అతనికి తోకొక్కటే తక్కువ ఎర్రగా, అచ్చు పండుకోతిలాగే ఉంటాడు"

"పోని ఆ ప్లీడరుగారి తమ్ముడూ?"

"ఓ అతనా! అందరూ లక్ష్మణస్వామని చెప్పుకుంటారు అలాగైతే ఊర్మిళాదేవిలా నిద్ర పోవాల్సిందే నా కసలే నిద్ర తక్కువ" అంటూ నవ్వుతూ కళ్లు తిప్పింది

ఇలాగ ప్రతీ వాళ్లకూ ఏదో వంక పెట్టేసి ఒక్కటీ పడనిచ్చేదికాదు

"అన్నిటికీ అన్ని వంకలూ పెడ్తూకూర్చో నా కసలే గుండెనెప్పి ఎప్పుడో ఆ కాస్త ప్రాణం గుటుక్కుమంటుంది నీ నెత్తిన రెండు అక్షింతగింజలు వేసేయోగం నా ముఖాన్నరాసి ఉంటేగా'

"అమ్మా నీ కేమీ ఫరవాలేదు నే పుట్టినప్పటి నుంచి వస్తోంది నీకా నెప్పి" అంటూ ఎప్పటికప్పుడు కొట్టి పారేస్తూ వుండేది

ఏ పెళ్లి బాజాలు వినిపించినా తమ ఇంట్లో ఎప్పుడు మ్రోగుతాయోనని, ఎవరు మనవళ్ల నెత్తుకున్నా తనకాయోగం ఎప్పటికి పడుతుందా అని ఎదురు చూస్తూ ఉండేది, అన్నపూర్ణమ్మగారు

మంజుల మాత్రం ఏ సంబంధమూ ఒప్పుకొనేది కాదు పోనీ కాలేజీలో ఎవరినైనా

ప్రేమిస్తోందా అంటే అదీ వున్నట్లు లేదు కాలేజీలో చేరిన కొత్తల్లో ఒకళ్లిద్దరు వెర్రి మొర్రి వేషాలు వేయబోతే చెప్పుతో గట్టిగానే బుద్ధి చెప్పిందట దాంతో మగపిల్లలెవ్వరూ కన్నెత్తి చూడలేదుట ఆమెకు భద్రకాళి అని పేరు కూడా పెట్టేరుట

అన్నపూర్ణమ్మగారు మధ్య మధ్య భర్త మీద విరుచుకుపడేది ''మీ రింత అలుసు ఇవ్వబట్టే అదీ అట్లా కొరకరాని కొయ్యలా తయారైంది ''

''పోనీలేవే దానికిష్టమైనప్పుడే, దానికి వచ్చిన వాడిని చేసుకుంటుందిలే'' అనేవారు

''ఆ, దీని ఈడుదే వాళ్ల శశిరేఖ పనస పండు లాంటి బిడ్డను కంది ఎంత ముద్దుగా వున్నాడనీ, ఆ మనవణ్ని చూసుకుని ఆవిడ వింత మురిసిపోతోందో ఇంతకీ నా ముఖానికి ఆ యోగం ఉండొద్దూ'' అని బాధపడేది

''అమ్మా! ఎందుకంత బాధపడతావ్? మన లిల్లీకి ఆరు పిల్లలు పుట్టేయి అవి కూడా బొద్దుగా ముద్దొస్తున్నాయ్ వాటిని హాయిగా ఎత్తుకుని కూర్చో''

''ఎత్తుకుంటానమ్మా, ఎత్తుకుంటా దేవుడు నా ముఖాన్న పిల్లి పిల్లలను, కుక్క పిల్లను ఎత్తుకోమనే రాసేడేమో''

ఆవిడకు కూతురి పెళ్లి ఒక సమస్యలా తయారయింది అందుకనే అద్దెకోసం వచ్చిన ఆ కుర్రాణ్ని చూడగానే అన్ని విధాల బాగా ఉన్నట్లు కన్పించి అద్దె ఎక్కువ చెంతే ఎక్కడ పోతాడోనని తక్కువ అద్దెకే ఇచ్చి తను వేసిన పాచిక పారటం కోసం ఎదురు చూస్తూ కూర్చున్నారు అన్నపూర్ణమ్మగారు

* * *

మంజుల వారం రోజుల వరకు అతని ప్రవర్తనను వాచ్ చేస్తూనే ఉంది అతను స్నానానికి వెళ్లేడప్పుడు కానీ బయట నుండి లోపలకు వచ్చేడప్పుడు కానీ తల ఎత్తి చూసేవాడే కాడు ఒకటి రెండుసార్లు ఆమె చూడకుండా మేడ దిగుతున్నప్పుడు ఆమెకేసి ఒకసారి చూసి బాధగా తల వంచుకునేవాడు అతను మంచి వాడేనన్న నిర్ధారణకు వచ్చి అతని విషయం పట్టించుకోవడం మానేసింది మంజుల

ఒకరోజు వాన పడుతోంది ఆమె క్లాసులకి కార్లో వెళ్లబోతుంటే, అతను సైకిల్ పుచ్చుకుని కాలేజీకి వెళ్లటం కోసం వానతెరిపి చూస్తూ నించున్నాడు ఆమెకు జాలివేసి



## బుద్ధిమంతుడు

తన కారులో ఎక్కమంది. అతను మొహమాట పడ్తూనే ఎక్కాడు ఆ రోజు నుండి ఆమె తరుచు అతన్ని తన కార్లోనే దింపుతోంది తల్లికీ విషయం తెలిసి చాలా సంతోషపడింది

కొన్నిరోజులకు తరుచూ ఆతని గదిలో అతనిచేత పాఠాలు చెప్పించుకొనేది. అమ్మా అతనికి అవిష్టం, ఇవిష్టం అంటూ అన్నీ పట్టుకువెళ్లి, పెట్టి వచ్చేది. గంటల కొద్దీ అతనితో నవ్వుతూ కబుర్లు చెప్తూవుంటే ఏనుగెక్కినంత సంబరంగా ఉండేది అన్న పూర్ణమ్మగారికి ఇద్దరూ కలిసి సినిమాకు వెడ్తూ ఉంటే చిలకా గోరింకల్లా వున్నారని మురిసిపోయేది.

తన కోరిక తీరే తరుణం ఆట్టే దూరం లేదనుకొని జరగబోయే పెళ్ళిని గురించి కలలు కంటూ ఉండేది పెళ్లి ఎంత ఘనంగా చెయ్యాలో, కూతురుకు ఏమేమి నగలు చేయించాలో, అల్లుడికి ఏమేమి పెట్టాలో, ఏం ఫర్నిచర్ ఇవ్వాలో ఆలోచించు కుంటూ ఉండేది

మధ్య మధ్య భర్త కూడా "పూర్ణా! నీ పాచికెంత వరకొచ్చింది ?" అంటూ నవ్వేవారు ఏ రోజు జరిగిన విశేషాలు ఆ రోజు చెప్తూ ఆనందపడి పోయేది.

మంజుల బర్త్‌డేకి ఒక చీర కూడా ప్రెజెంట్ చేసేడు, శ్రీధర్ నిజానికి అది తమ అంతస్తుకు తగింది కాకపోయినా చాలా బావుంది అంటూ, తరచు అదే కట్టుకొ మనేది. కూతురికి బాగా నచ్చాడనే నిశ్చయాని కొచ్చి ఈ శూన్యమాసం పోయేక వాళ్ల వాళ్ల అడ్రస్ కనుక్కొని ముహూర్తం పెట్టించా లని చూస్తోంది, అన్నపూర్ణమ్మ

పరీక్షలైపోయాయి శలవలిచ్చారు అతను మెల్లిగా వచ్చి "మంజుల ఇంకా రాలేదా అండీ ?" అన్నాడు

"కూర్చో నాయనా ఇంకారాలేదు ఏం?"

"నేను మా ఊరు వెడుతున్నాను చెప్పి వెడదామని వచ్చానండీ"

"చూడు బాబూ! మీ అడ్రస్సూ అదీ చెప్పితే మీ వాళ్లతో మాట్లాడి ముహూర్తం పెట్టిస్తాను"

అతను తెల్లబోతూ ఉంటే "అదేనాయనా! అమ్మాయి నీకు నచ్చింది కదా మీ వాళ్లతో చెప్పి ముహూర్తం పెట్టిద్దామనీ,"

"మీరు మాట్లాడేదేమిటో నా కర్థం కావడం లేదండీ" అన్నాడు అమాయకంగా.

ఈసారి ఆవిడకు కొంచెం కోపం వచ్చి "అమ్మాయితో సినిమాల కెళ్లటం, షికార్లు కొట్టటం తెలుసును కాని నా మాటలే అర్థం కావటం లేదా?"

అతనికి నోటమాట రాలేదు తెల్లబోతూ "నాచనువు మీకు అటువంటి అపోహను కలిగిస్తే నన్ను క్షమించండి నాకు ఇదివరకే మా మేనమామ కూతురితో నిశ్చయమైందండీ" అని సిగ్గుపడ్తూ చెప్పాడు

వీడి సిగ్గు చిమడా అని మనసులోనే అనుకొని "ఆసంగతి ముందే ఎందుకుచెప్పలేదూ?" అంది

"ఏ సంగతండీ ?"

"అదేనయ్యా నీ కిదివరకే పెళ్లి నిశ్చయమైందనీ"

"మీరు అడగలేదు కదండీ"

ఇంతలో మంజుల గబగబా లోపలికి వచ్చి, అతన్ని చూసి "నువ్వింకా ఊరికి వెళ్లిపోయావేమో ననుకుంటున్నాను ఈ సారి ఒక్కడివీ కాదు వదినను కూడ తీసుకురావాలి తెలిసిందా?" అంది

అన్నపూర్ణమ్మ "ఆ!" అంటూ తెరచిన నోరు తెరచినట్లే వుంచేసి, అక్కడే ఉన్న సోఫాలో కూలబడింది

అతను వెళ్లిపోయాడు

మంజుల తల్లి వెనుక నిలబడి ఆమె మెడ చుట్టూ చేతులు వేసి "అమ్మా! భగవంతుడు నాకు అన్నయ్యలేని లోటు తీర్చాడమ్మా శ్రీధర్ చెల్లెలు అచ్చు నాలానే వుండేదట ఆమె ఏక్సిడెంట్‌లో చచ్చిపోయిందట ఆమె ఫోటో చూపించి కళ్లనీళ్లు పెట్టుకున్నాడు" అని చెప్పింది

ఇంతలో విశ్వనాథంగారు వచ్చి భార్య దిగులుగా కూర్చోవడం చూచి "ఏం పూర్ణా! అలా వున్నావు? నీ పాచిక పారలేదా ?" అన్నారు కూతురుకేసి చూసి నవ్వుతూ ఆవిడ కోపంగా "మీ రిద్దరూ కలిసి నన్ను గాడిదను చేసారన్నమాట" అంటూ లేచి, తనగదిలోకి పోయి పడుకుంది

## తెల్లారింది!

— వారణాసి రామమూర్తి

తెల్లవారగలేచి
పిల్లజెల్లల లేపి,
ఇల్లు వాకిలి వూడ్చి
అంట్లు చెంబులు తోమి,
కుంపటంటించి
కాఫీకి నీళ్లెట్టి,
పాలవాడెప్పుడొచ్చు
పనెప్పుడవునంచు,
పుల్లలేరుకువచ్చి
పొయ్యి రాజేసి
పొగలు చిమ్మేదాని
వూదుచు కూర్చుంటి!

పాలవాడొచ్చె
పోసిపోయె నొకగిద్ద!
'కూర'లమ్మివచ్చె,
'కొట్టు' శెట్టివచ్చె
డబ్బు, డబ్బంచును! వారి
సర్దిపంపుటకు

పట్టె చాలసైము!

పిలుకు పలుకూలేక
ఇంటింట్లో నాసామి

పనిగట్టుకు కూర్చుండి
పొయ్యి వూదుచునుండె,
పొయ్యి రాజకుండె!

పాలుపాలనే పిల్లల
కసిరికొట్టేసి,

ఆకలినిచంపేటి
'వోషధి' కాఫీయంచు

గిద్దెడు పాలలో
చెంబెడు నీళ్లోసి,
కాఫీని కలిపేసి

గ్లాసుల్లో పోసిస్తి!

పల్చబడిన మొహాలు
ఎండిపోయిన జుట్లు,
చినిగిపోయిన ముక్కలు
చివికిపోయిన బట్టలు,
సరిచేసుకొని
సర్ది చూచుకొని
బడికిపోయిరి పిల్లలు!
పనికై పోయెను సామి!

పొగలు చిమ్ముచుండెగాని
పొయ్యి రాజదాయె
పొగలు సెగలేగాని

జీవనాన సొంపులేదు!
పొగచూరి పోవుచుండె
ఇల్లు! వళ్లు!

బడికి పోయెడి నా పాపలు
పెద్దలైయ్యెదు నెప్డు ?
బక్కచిక్కిన నాసామికి

పనిదొరుకు నెపుడు ?
పొయ్యి రాజునెపుడు ?
నూక సంకటవుటెప్పుడు ?

పొయ్యిలోని పొగలు సెగలువారె
కళ్ల నీళ్లుగమ్మి సుళ్లువారె!
లోకి సూర్యుడచ్చి పడియె
చూరుదాటి!

ఏమిజేతును పని
ఇంకేమి గలదు ?

ఈ రోజుకీ బ్రతుకు
తెల్లగా తెల్లారి పోయె!

# ప్రపంచము యొక్క ప్రప్రథమ డెటర్జెంట్ ఉతికే బార్

# సూపర్ 777



**హెచ్చు తెల్లదనము, తక్కువ ఖర్చులో**




సూపర్ 777 ఉతుకు ప్రపంచములో సరిక్రొత్తది! ఇది క్రొత్త ఫార్ములా దీనికి ఎక్కువ బట్టలను ఎక్కువ తెల్లగా, ఎక్కువ శుభ్రముగా ఉతికే సామర్థ్యము ఉన్నది—ఉప్పు నీళ్లలో కూడ! దీని ధర మామూలు బార్ సబ్బుల కంటె తక్కువ కూడ!

**ఒక క్రొత్త రకపు ఉతికే బారును వాడడము ప్రారంభించండి—సూపర్ 777 డెటర్జెంట్ ఉతికే బార్!**

shilpi hpma 6A/73 TEL

—— సీరియల్ ——

# లాలస

—— కాకాని కమల ——

*(గత సంచిక తరువాయి)*

శ్రీనివాస్ ఈ మధ్య రమేష్ పెళ్ళికి వెళ్ళి వచ్చాడు హవుస్ సర్జన్ అయిపోవచ్చింది ఆ తరువాత ఎక్కడో అక్కడ వుద్యోగం అయితే వెళ్ళిపోవచ్చు ఇంక అభ్యంతరాలు మాత్రం ఏమున్నాయిగనుక ? అని రమేష్ మేనమామ పెళ్ళికి లగ్నాలు పెట్టాడు రమేష్‌కూడా అందుకు అభ్యంతరం చెప్పలేదు రమేష్ మేనమామది చిన్నగ్రామం ఆయన కామందు వున్న కొద్దిపాటి పొలం స్వంత వ్యవసాయం చేస్తాడు స్వంత ఇల్లు వుంది అదీ చౌడు మిద్దె! మధ్యతరగతి కుటుంబం

పెళ్ళి కూతురు నిర్మలను చూసి ఆశ్చర్య పోయాడు శ్రీనివాస్ నల్లగా పీలగా వుంది చెప్పుకోతగ్గ ఆకర్షణ ఏమి లేదు బి.ఏ ప్రైవేటుగా చదువుతున్నది అదంతా రమేష్ శ్రద్ధే! కాని చాలా నెమ్మదస్తురాలులా వుంది అందం, ఆకర్షణ లేకపోయినా వాటిని మించిన ప్రత్యేక భావం ఏదో కనుపిస్తున్నది ఆమె ప్రవర్తన దీనికి కారణం కావచ్చు పేరుకు తగ్గట్లే ఆమె మొఖంలో నిర్మలత, చక్కటి ప్రశాంతత వున్నాయి పెళ్ళి ఆడంబరాలు ఏమి లేనిదానిలా చాలా నిర్లిప్తంగా వుండామ్మాయి రమేష్ పక్కన కూర్చుంటే "కాకి ముక్కుకి దొండ పండు" అన్న సామెత చక్కగా వర్తించేటట్లు వుందా జంట! రమేష్ చూస్తూ చూస్తూ ఈ పిల్ల మెళ్ళో తాళి ఎలా కడుతున్నాడా అని ఆశ్చర్యపోయ్యాడు శ్రీనివాస్ ఆ క్షణాన అతని స్మృతి పథంలో భార్య అనూరాధ మెదిలింది అనూరాధ అందమైన వాళ్ళల్లోకి వస్తుంది మంచి ఒడ్డూ పొడుగూ, పచ్చటి రంగూ, వున్నత సంస్కారం వున్న గుణవంతురాలు "అనూరాధ కేం? రవ్వలాంటి పిల్ల" అనుకున్నాడు స్నేహితుడైన రమేష్ దయ వల్ల అతనిలోని నిద్రాణమై వున్న సంస్కారం ఇప్పుడిప్పుడే మేల్కొంటున్నది

"నీకు తెలియదు శ్రీనివాస్! అందరికి కనుపించేది నిర్మల బాహ్య రూపమే! కాని ఆమె అంతః సౌందర్యం నాకు తెలుసు! నిర్మల దేవత" అంటాడు రమేష్ వారి మధ్య ప్రేమానురాగాలు అంతటివి చిన్నప్పట్నుంచి ఒకరిపై ఒకరు మమత పెంచుకున్నారు నిర్మల అందమైనది కాకపోవచ్చు కాని అనాకారి మాత్రం కాదు అపాటిచాలు పైగా రమేష్ నయాపైసా కూడా కట్నం తీసుకోక పోవటం శ్రీనివాస్‌ని ఆశ్చర్యంలో ముంచి వేసింది

పెళ్ళి అయిన వెంటనే బయలుదేరాడు శ్రీనివాస్ వుండు నిర్మలని పరిచయం చేస్తాను అంటూ లోపలికి తీసుకెళ్ళాడు రమేష్ గదిలో కూర్చున్న నిర్మల చటుక్కున లేచి నుంచుంది

"నిమ్మీ! ఇతను నా బెస్ట్‌ఫ్రెండు శ్రీనివాస్! నీకు ఇంతకు ముందు చెప్పానుగ ఇతన్ని గురించి" అన్నాడు

నవ్వుతూ "నమస్తే" అంటూ చేతులు జోడించింది నిర్మల శ్రీనివాస్ తిరిగి వచ్చేస్తుంటే లోపలికి వెళ్ళి ఒక ప్యాకెట్ నిండా లడ్డూలు, మిక్చరు తెచ్చి అతనికిచ్చింది

"ఎందుకండి" అన్నాడు మొహమాటంగా.

"ఫరవాలేదులే! వుంచు" అన్నాడు రమేష్ ఇవతలికి వచ్చాక అడిగాడు శ్రీను "రమేష్! నిర్మలగారికేం చెప్పావ్ నా గురించి" అన్నాడు అనుమానంగా

నిండుగా నవ్వుతూ చూశాడు రమేష్ "ఏం చెప్పటమేం? నువ్వు నా స్నేహితుడివని, పెళ్ళికి వస్తావని మొన్ననే చెప్పాను" అన్నాడు

"అంతేనా! ఇంకేమయినా చెప్పావా ?" అన్నాడు సందేహంగా

రమేష్ అసలు విషయం ఇప్పుడు గ్రహించాడు 'ఓహో అదా నీ భయం" అంటూ మెల్లిగా జబ్బమీద చరిచాడు అతని చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు

"శ్రీనూ! నీకు నేను చెప్పేది ఎప్పుడూ ఒక్కటే! నువు అనూరాధ గారికి అన్యాయం చెయ్యకు నేను ఇలా అంటున్నానని కోపగించుకోకు" అన్నాడు వ్యధిత కంఠంతో

"కోపమెందుకురా! అయినా నేను ఆవిడికి చేసిన అన్యాయం ఏముంది ?"

"అలా నువ్వు అనుకుంటే సరిపోయిందా? —అన్యాయం అంటే తిండి పెట్టక పోవటం, పుట్టింటికి వెళ్ళగొట్టటమే కాదు ఆ అమ్మాయి మీ పెళ్ళి అయినప్పట్నుంచి మీ ఇంట్లోనే వుంటోంది కాని నువ్వు ఒక్కసారైనా ఆప్యాయతతో ఆవిడ్ని పలకరించావా? ఆదరణతో చేరదీసావా? ఎందుకురా మన చదువులు? పెళ్ళయి మూడేళ్ళయి ఎదురుగుండా భార్యని పెట్టుకుని ఒంటి మీద చెయ్యి వెయ్యకుండా వున్న మగవాణ్ణి నిన్నొక్కణ్ణే చూశాను కనీసం మాట్లాడటానికేం? ఆ అమ్మాయి ఎంత క్షోభ పడిందో నీ మీద ఎటువంటి అపోహలు పెంచుకుందో ఆలోచించావా? పెళ్ళి నూరేళ్ళపంట! కాని నీ వంటి వ్యవసాయదారుని చేతులో ఏడాదికి మాడిపోవల్సిందే! .

.— అనూరాధ అందమయిన పిల్ల ఆ పిల్ల నెమ్మదస్తురాలు కాబట్టే ఇన్నాళ్ళు గుట్టుగ వుంది ఆ అమ్మాయిని దూరంగా వుంచావు గాని ఏం నిన్ను చదువుకోవద్దందా? అట్లా అనుకున్న ఈ పట్టుదల చదువులో

**జరిగినకథ** 8 రామనాధంగారి భార్య సుభద్రమ్మ వారికి అనూరాధ, లక్ష్మి, సుందరి, శోభ అనే నల్గురమ్మాయిలు, రమణ అనే అబ్బాయి ఉన్నారు అనూరాధకు పెళ్ళి సంబంధాలు చూస్తూంటారు రామనాధంగారు అనూరాధని చూసుకుని వెళతారు పెళ్ళివారు ఎమ్ బి బి ఎస్ చదువుతున్న శీనివాస్‌తో అనూరాధ వివాహం జరుగుతుంది యౌవ్వనోద్రేకంలో తప్పటడుగు వేస్తారు సుందరి కృష్ణలు భర్త శ్రీనివాస్‌కు తనంటే ఇష్టంలేదని ఎవరినన్నా ప్రేమించి ఉంటాడని అనుకుంటుంది అనూరాధ పండక్కి రానందువల్ల కూతురు, అల్లుడికిగాను వియ్యంకుడి పేరున డబ్బు పంపిస్తారు రామనాధంగారు అనూరాధపట్ల తన ప్రవర్తనకు పశ్చాత్తాపపడతాడు శ్రీనివాస్ గర్భవతి అయిన సుందరికి ఆమెకు అన్యాయం చేయనని ధైర్యం చెపుతాడు కృష్ణ కృష్ణ సుందరిల వివాహానికి కృష్ణ తండ్రి అంగీకరించటంతో శాంత పెళ్ళికి కూడా లగ్నాలు పెట్టిస్తారు రామనాధంగారు,

చూపించ వచ్చుగా. ఆ అమ్మాయి పెద్ద చదువు చదువుకోలేదని నీ కభ్యంతరంగా అనిపిస్తే, నువ్వు చేయూతనిచ్చి గ్రాడ్యుయేటు చెయ్యవచ్చునే!

ఒరేయ్! శ్రీనూ ... అనుకుంటాం గాని మనదంతా భ్రమరా! ... చదువుకోని అమ్మాయి భార్యగా వస్తే, బాగా చదువుకున్న అమ్మాయి అయితే బాగుండేది అని పిస్తుంది. చదువుకున్న ఆవిడ వస్తే, ఆ అమ్మాయి స్వేచ్ఛా ప్రవృత్తిని సహించ లేక చదువుకోనిదయితే అణిగి మణిగి వుండేది అని చింతిస్తాం! అంతెందుకు? నీ భార్య స్వతంత్ర భావాలు గలదయితే ఈ పాటికి పుట్టింటికి వెళ్ళిపోయి వుండేది.

నీ పిచ్చిగాని, నీతో సమానంగా చదువుకున్న పిల్ల అయితే నీ మాట వింటుందం టావా? ఇద్దరు సరిసమానం. పురుషుడు ఎప్పుడూ ఇంట్లో భార్యమీద తన ఆధిపత్యం కోరుకుంటాడు నీ భార్య కూడా డాక్టర్ అయితే ఆవిడకి నువ్వే సేవ చెయ్యాలి. కాని అదే సామాన్య గృహిణి అయితే అలసి సొలసి వచ్చిన నీకు సేవ చేస్తుంది అసలు ఏదైనా సర్దుకుపోవటం అలవరుచుకున్ననాడు ఎటు వంటి జీవితమయినా సుఖాన్ని ఇస్తుంది.




అనూరాధ మంచి అమ్మాయి. నీకు తగ్గ జోడు. వాళ్ళు ధనికులు కాదంటావా? మీరే మంత ధనికులు? ఇలా అంటే నీకు కోపం రావచ్చు కాని రేపు మీ చెల్లెలు భర్త నీలాగే ప్రవర్తిస్తే ఆమె గతేమిటి?

అసలు మనం కట్నం తీసుకున్నందుకే సిగ్గుపడాలి తరం మారాలి లేకపోతే ఎన్ని చదువులు చదివిన ఎంత ఆదర్శం వల్లించినా, ఆచరణలో పెట్టలేనినాడు ప్రగతిని సాధిం చలేం! నువ్వు కట్నం తీసుకున్నావని నేను అనటంకాదు. సరే మీ ఆర్థిక పరిస్థితిని బట్టి నీవు తీసుకున్నావు తప్పులేదు. కాని అదేదో చాలా తక్కువని ఆవిడ నీకు తగదని అభిప్రాయపడటం తప్పు. తోడునీడగ మెలిగే అర్ధాంగిని రెండుచేతులా ఆహ్వానించాలిగాని అందుకు ప్రతిఫలం తీసుకోవటం, అది చాల లేదనుకోవటం ఎంత హాస్యాస్పదం? నువ్వు చదువుకున్నవాడివే! నీకు నేను వేరుగా చెప్పాలా? కాని నీవు ఒక విధమయిన మూర్ఖపు పట్టుదలతో వున్నావు. ఒకరి మీద కసిని ఇంకొకరి మీద తీర్చుకుంటున్నావ్! నీ ప్రవర్తనే నాకు బాధగ వుంది'' అన్నాడు.

కొద్దిక్షణాలు శ్రీనివాస్ మౌనంగా వుండి పోయ్యాడు ''పొరపాటయి పోయిందిరా! నా మూర్ఖపు ప్రవర్తనకి నాకే సిగ్గేస్తూంది చివరికి'' అన్నాడు.

సంభ్రమంగా చూశాడు రమేష్ థాంక్యూ బ్రదర్! అంటూ తన చేతిని అతని భుజం చుట్టూ చుట్టి కౌగలించుకున్నాడు ఆప్యాయంగా.

''నే చెప్పాననికాదు. నీకుగా నువ్వు బాగా ఆలోచించు. అందంగా లేకపోతే అందం ఎలా తేవాలి? అనుకోవచ్చు. నీకా సమస్య లేదు. ఇంక చదువుసంధ్యలు నీ చేతుల్లోనే వున్నాయి. నాలుగేళ్ళ నాటికి ఆమెని పట్టభద్రురాలును చెయ్యవచ్చు. నీవు బాగా సంపాదించ గలిగిన

(32 వ పేజీ చూడండి)

# చెయిజారిన స్వర్గం

మోర్తల గోపాలరెడ్డి

*(గత సంచిక తరువాయి)*

**శాం**త పెళ్లి యింకో వారంరోజు లుండగా తీసు కెళ్లడానికి నాన్న వచ్చాడు. "శలవు దొరకడం కష్టం. రాధను తీసుకెళ్ళు బావా" అని మామయ్య తేలిగ్గా పైకి అనేసిన మాటల వెనుక వున్న అర్థం తనకు తెలుసుగాని నాన్నకేం తెలుసు ?

"అదేమిటోయ్ అలా అంటావు. నువ్వు రాక పోతే మీ అక్కయ్య వూరుకుంటుందా ? అల్లుడు బాగా చదువుకున్నవాడు. అంచేత పెళ్లి కాస్త ఘనంగానే చేద్దామనుకుంటున్నాం. సంబంధం మాట్లాడినప్పుడు నీకు కబురు పంపిద్దామను కున్నాం. వ్యవధి లేకపోయింది. నాలుగువేలకు తక్కువకు వాళ్లు ససేమిరా వొప్పుకోలేదు. డబ్బు కోసం చాలా యిబ్బందయిందోయ్..." నాన్న చెపు తుంటే తల వూపుతున్న మామయ్య కళ్లలో, బుర్రలో కదులుతున్న ఆలోచనలు తను గమనించ గలుగుతోందిగాని నాన్నకేం తెలుసు ?

"నాల్రోజులు సి. యల్. పెట్టండి" మర్యాద కోసం తను మధ్యలో జోక్యం చేసుకోవాల్సి వచ్చింది అయిష్టంగానే.

నమిలి మింగినట్టు కొరకొరా తనవైపు చూసి "కష్టం. దొరకదు. వర్క్ చాలా హెవీగా ఉంది. మీ నాన్నతో నువ్వు వెళ్ళు. పెళ్లినాటికి ఎలాగోలా వస్తాను" అన్నాడు.

రాడని తనకు తెలుసు.

"సరేనోయ్! అమ్మాయిని తీసుకెడతాను. నువ్వు కాస్త ముందుగా వస్తే మంచిది. పెళ్లి ఏర్పాట్లు అవీ చూడాలి." అని నాన్న అంటుంటే మామయ్య మొహంలో రకరకాల రంగులు కని పించాయి తనకు

నాన్న స్నానం చేస్తున్నాడు. ఇంకో గంటలో తను ప్రయాణమవబోతుండగా అడిగింది తను — "మనంకూడా ఏదన్నా చదివించితే బావుంటుంది."

"నాదగ్గర యిప్పుడు డబ్బు లేదు. చదివించక పోతే ఇప్పుడు మునిగిపోయిందేమీ లేదు." అంటూ బయటి కెళ్లిపోయాడు ధుమధుమలాడుతూ.

నాన్నకు అన్నం వడ్డించి తను పక్కింటి విశాల వద్ద పదిరూపాయలు పట్టుకొచ్చింది. బస్ టైం కావొచ్చినా మామయ్య రాలేదు.

"చంద్రం యింకా రాలేదేమిటమ్మా ? అవతల మనకు బస్ టైం అవుతోంది" అన్నాడు నాన్న.

మామయ్య కావాలని మొహం తప్పించాడని తనకు తెలుసుగాని నాన్నకేం తెలుసు ?

"ఏదో అర్జంటుపని తగిలివుంటుంది నాన్నా."

"సరే మనం బయలుదేరుదాం." తాళంచెవి విశాలకు యిచ్చింది తను.

మామయ్య రాలేదని అమ్మ చాలా నిరాశ పడింది.

"ఏం మాయదారి ఆఫీసులో ? పెళ్లిళ్లకు కూడా శలవు యిచ్చిచావరు. పాపం వాడి మనసెంత కొట్టుకులాడుతుందో ? శాంత పెళ్లి చెయ్యాలి అక్కాయ్ అని ఒకటే యిదయిపోయేవాడు." అంటూ అమ్మ కాసేపు వాపోయింది. అమ్మ చాలా అమాయకురాలనుకుని తను నవ్వుకుంది.

శాంత పెళ్లి బాగానే జరిగింది. తను అను కున్నట్టు మామయ్య రాలేదు. శాంతకు పది రూపా యలు చదివిస్తుంటే తనకు చాలా సిగ్గనిపించింది. తనేం చేయగలదుమరి ? పెళ్లి అయిన రెండోనాడే తను తిరిగి బయలుదేరుతుంటే అమ్మ "నువ్వెక్క డికే ? కాన్పు అయ్యేవరకు యిక్కడే వుండు. వాడికి ఉత్తరం వ్రాయిస్తాను" అంది. పురుడు అయ్యేవరకు అంటే ఇంకా ఆరునెలలపాటు ఇక్కడే వుంటే యింకేమయినా వుందా ?

"ఆరోనెలే గదమ్మా ! మామయ్యకు భోజ నానికి యిబ్బంది అవుతుంది. నే వెడతాను."

"అలాగేనమ్మా ! ఇంకో రెండు నెలలయ్యాక దాన్ని తీసుకొద్దామే. పాపం చంద్రం కష్టపడ తాడు" అని నాన్న చెపితే అమ్మ అంగీకరించింది.

"పాపం చంద్రం పెళ్లికి రాలేకపోయాడు. నేను వాణ్ణి చూసికూడా చాలా రోజులయింది" అంటూ అమ్మ ఏడవడం మొదలుపెట్టింది. ఓదార్చడానికి తాతలు దిగివచ్చినంత పనయింది తనకు.

తోడుగా నాన్న వస్తానంటే వద్దని తనొక్కర్తే బస్సెక్కింది. ప్రయాణం చేస్తున్న ఏడుగంటలసేపు మావయ్య గురించే ఆలోచించింది తను. మాట్లాడతాడో లేదో ? ఏమంటాడో ?

తను యింట్లో అడుగు పెడుతుంటే భయ మనిపించింది.

మావయ్య అన్నం వండుతున్నాడు.

"నే చేస్తాను" అంటూ తను పొయ్యిదగ్గరకి వెళ్లింది.

చెదపురుగును చూసినట్టు చూసి ప్రక్కకు జరిగాడు.

"అమ్మ మీ కోసం చాలా ఎదురు చూసింది" అంది ముందుగా తనే.

"నా బదులు నువ్వు వెళ్లావుగా నిర్వాకానికి ? సిగ్గు లేకపోతే సరి."

"ఇందులో సిగ్గు పడాల్సింది దేనికి ?"

"నేను వెళ్ళని పెళ్లికి నువ్వు ఎందుకు వెళ్ళావ్ ?"

"మీరేగదండీ వెళ్ళమంది ?"

"మాట అన్నంత మాత్రాన అయ్య వెంట వెళ్ళడమే నన్నమాట. అసలు నీకేమయినా సిగ్గు వుంటేగా. ధూ" అని మొహాన వుమ్మేసరికి తను కోపాన్ని అదుపులో పెట్టుకోలేకపోయింది.

"మీ కేమయినా మతి పోయిందా ?" అంది తను కొంచెం కోపంగా. అంతే. తన చెంప ఛెళ్ళు మంది.

"నోరెత్తావంటే పళ్ళు రాలతాయి. నీకు సిగ్గులేకపోతేపోయింది వాళ్ళకయినా సిగ్గు వుండ క్కర్లా. నాకు దమ్మిడీ కట్నం యివ్వకుండా ఆ పోరంబోకు వెధవకు నాలుగు వేలు ముట్టచెప్తారా ? నేనేంగాజులు తొడిగించుక్కూర్చున్నా ననుకున్నారా?" అంటూ మావయ్య వుద్రేకంతో వూగిపోతున్నాడు. ఇంతకాలం తనలో దాచుకున్న గరళాన్ని బయటకు కక్కుతున్న మావయ్యను చూస్తుంటే తనకు అసహ్యమనిపించింది.

ఈ మనిషినా అమ్మ దేవుడు, దేవత అంటు న్నది ?

ఆ రోజు నుంచి తన జీవితం తారుమా రయింది. అంతకాలం పూలబాట అనుకున్న మావయ్య సహచర్యం కత్తుల బోనులా అనిపించింది.

సరిగా యింటికి వచ్చేవాడు కాదు. వచ్చినా పలకరించేవాడు కాదు. పలకరించినా ఆ మాటలో వెయ్యి విరుపులు, ఆ చూపుల్లో లక్ష వంకర్లు.

ప్రతి నాలుగయిదు రోజుల కొకసారి ఏదో సాకుతో కొట్టేవాడు.

ప్రతి పది రోజుల కొకసారి — తనను మోసం చేశారని అమ్మమీద, నాన్నమీద విరుచుకు పడేవాడు.

అలా నెల రోజులు గడిచాయి.

అమ్మ వచ్చింది తనను తీసుకెళ్ళడానికి.

"వురేయ్ చంద్రం అమ్మాయిని తీసుకెడు తున్నాను. పురుడు పోసి బాబును రాధ చేతి కిచ్చి నీ వద్దకు మళ్ళీ పంపిస్తాను" అని అమ్మ అంటుంటే మామయ్య నవ్వాడు, నవ్వు వెనుక నల్లటి మసి రాసిన అద్దం పెట్టుకుని. తనను హింసించే మావయ్య కట్నం సంగతి సూటిగా అమ్మనే అడ గొచ్చుగా ? ముఖాముఖిగా నాన్నతో తేల్చుకోవచ్చుగా? పెద్ద మనుషులుగా చెలామణి అయ్యేవాళ్లు అది నాగరికతగా భావించరేమో ? నోటితో వాళ్ళే అడ గడం బహుశా నామోషీ కాబోలు ?

అమ్మ వెంట బయలుదేరేముందు "వస్తాను. మీ ఆరోగ్యం జాగ్రత్త ! వుత్తరాలు రాస్తూ వుండండి" అని చెప్పింది. తలవూపాడు మావయ్య, కనుబొమలు వంకరగా తిప్పి.

బుజ్జిగాడు పుట్టబోయేముందు నాలుగు ఉత్త రాలు, బుజ్జిగాడు పుట్టిన పది రోజుల్లోపు మరో రెండు వుత్తరాలు కలిపితే ఆరు ఉత్తరాలు. ఆరు ఉత్తరాలు, ఒక్క జవాబుకూడా తెప్పించలేక

> **జరిగిన కథ 1 : రాజమ్మ రామి నాయుడుల**
> ఆరుగురి సంతానంలో రాధ పెద్దది. కట్నం యివ్వలేక రెండోపెళ్లి వాడైనా తమ్ముడు చంద్రంతో రాధ పెళ్లి జరిపిస్తుంది రాజమ్మ. మరదలు శాంతకు నాలుగు వేలిచ్చి వివాహం చేయటం అవమానంగా భావించి తనకూ కట్నం తెమ్మని భార్యను పుట్టింటికి పంపేస్తాడు చంద్రం.

పోయాయి. కుమిలి కుమిలి ఏడ్చింది.

"చంద్రం రాలేదేవిటే ?" అని అమ్మ పదే పదే అడిగింది.

"ప్రమోషన్ రాబోతుందిగదే! అందుకని మావయ్య కష్టపడి పని చేస్తున్నాడు. శలవు తీసుకోవడం బాగుండదనుకున్నట్టుంది. పాపం మావయ్య పంచప్రాణాలు నామీద, బుజ్జిగాడి మీదే వుంటాయి" అంది తనను తను మోసంచేసుకుని.

"అవునవును వాడి సంగతి నాకు తెలుసు" అంది అమ్మ.

బుజ్జిగాడికి మూడోనెల వచ్చింది. అమ్మ తనను తీసుకొచ్చి మావయ్య దగ్గర దిగబెట్టింది.

"పచ్చిబాలింత. పనిమనిషిని పెట్టుకోండి. ఎక్కువ పని చెయ్యడం మంచిదికాదు. తడికాళ్లతో నడవొద్దు. నువ్వు పెందరాడే యింటికి వచ్చేయ్. అమూల్‌స్ప్రే కంటే ఆవుపాలే శ్రేష్టం. ప్రతి రోజు వంటాముదం బుజ్జిగాడి మాడుకు రాయండి. కాకరకాయ, కారం తగ్గించండి" అంటూ అమ్మ తనకు, మావయ్యకు ఒక అరగంటసేపు పాఠం చెప్పి ప్రయాణమయింది.

అమ్మ వెళ్లిన మర్నాటి నుండి తనకు నరకం అంటే ఏమిటో అనుభవపూర్వకంగా అర్థమవసాగింది.

"ఏం, యిక్కడ యిన్ని ఆస్పత్రులు చావగా అక్కడికెళ్లి కని వచ్చావ్ ? అసలు మీ అమ్మతో వెళ్లడానికి నీకు బుద్ధి వుందా ? నాకంటే వాళ్లే నీకు ముఖ్యమన్నమాట ?"

"ఏమిటండీ అర్థంలేని మాటలు? ఆరోజు అమ్మ తీసుకెడుతుంటే మీరేగదా వెళ్లమంది ?" తన చెంపమీద ఫెడీమని నాలుగుదెబ్బలు పడ్డాయి. చెవులు గింగురుమన్నాయి. కళ్లు తిరిగాయి.

"వాగావంటే నరికేస్తాను. వూరుకుంటే నెత్తికెక్కుతున్నావ్. అసలు నీకు సిగ్గులేదు. సిగ్గు వున్న ఏ ఆడదీ మళ్లీ పుట్టింటికి వెళ్లదు. నాకు యింత అవమానం జరిగాక మళ్లీ నువ్వు ఆ గుమ్మం తొక్కుతున్నావు. నిన్ను నిలువునా తగలబెట్టినా పాపంలేదు. కట్నం సంగతి ఉత్తరం వ్రాయాలనే విషయం నేను నీకు చెప్పాలా ? నీకు మాత్రం తెలీదు ?" అంటూ యముడిలా తన మీదికి వచ్చే మావయ్యమీద తనకు వున్న మంచి అభిప్రాయంకాస్తా మసి అయిపోయింది. కుంటిసాకులతో తనను చితకబాదేవాడు.



వుత్తరం వ్రాయమని వొత్తిడిచేస్తే "రాశాను" అది తను అబద్ధం ఆడింది. అసలు సంగతి అమ్మకు తెలిస్తే గుండె ఆగి చచ్చిపోతుంది. అందుకే ఆ రహస్యాన్ని తన గుండెల్లోనే దాచుకుంది.

ఇంట్లోకి కావాల్సిన వెచ్చాలు తెచ్చేవాడు కాదు వెచ్చాలకు డబ్బు అడిగితే లేదనేవాడు. జాకెట్లు చీరెలు చిరిగినవి కట్టుకుని తిరుగుతున్నా చూస్తూ వుండేవాడు.

బుజ్జిగాణ్ణి ఒక్కసారయినా ఎత్తుకుని ముద్దు పెట్టుకున్నాడా ?

చింకి పాతలయిన చీరెలు వుతుక్కుందామంటే సబ్బు వుండేది కాదు.

అడిగితే "సబ్బులు కొనడానికి మీ తాతగారి ముల్లె లేదు" అని చెంపలమీద బాదేవాడు.

సబ్బు లేకుండా స్నానం చేయడం తనకు అలవాటయింది.

వెచ్చాలు లేక తను వంట చేయనందుకు దెబ్బలు.

రాత్రి తిన్న దెబ్బలవల్ల వొళ్ళు నొప్పులు అనిపించి వుదయం కాస్త ఆలస్యంగా లేచింది. బుజ్జిగాడు ప్రక్కన పడుకుని హాయిగా నిద్ర పోతున్నాడు. డ్రాయింగ్ రూంలోంచి మాటలు వినిపిస్తున్నాయి.

"చంద్రం! ఆడవాళ్ళను కంట్రోల్ చెయ్యాలోయ్. లేకపోతే నెత్తికెక్కి కూర్చుంటారు. నా సలహా చెప్పమన్నావు కాబట్టి చెప్తాను. నాదికూడా నీలాంటి కేసే. మనం డైరెక్ట్‌గా వాళ్ళను అడగకూడదు. మన ప్రిస్టేజ్ దెబ్బతింటుంది. అనవసరంగా మనం రచ్చ కెక్కుతాము. నీ వైఫ్ చేత వుత్తరాలు రాయించు. డబ్బు దానంతట అదే వస్తుంది. ఒకవేళ డబ్బు రాదనుకో, వెంటనే పుట్టింటికి పంపించు. పోనంటే తన్ని పంపించాలి. అమ్మగారు వెళ్ళిన మూడోనాడే డబ్బు మూట దానంతట అదే వస్తుంది. నాకు డబ్బు అవసరం అయినప్పుడల్లా యిదే పద్ధతి ఫాలో అవుతుంటాను. చదువుకున్నవాళ్ళు యిలా చేయాలంటే కొంచెం కష్టంగా వుంటుంది. తప్పదుమరి. నీ ప్లేస్‌లో నేను వుండి వుంటే నా తడాఖా చూపించి వుండేవాణ్ణి. ముక్కు పిండి వసూలు చేసి వుండేవాణ్ణి. మరీ అంత మంచితనం పనికిరాదోయ్. బి బ్రేవ్ మై బాయ్. నేను చెప్పినట్టు చేసి చూడు. నాలుగు వేలు నీ కళ్ళముందు వాలతాయి..."

తన రక్తం కుత కుత వుడికింది. వాడి గొంతు నులిమిపారేద్దా మనిపించింది. ఇలాంటివాళ్ళ మూలంగానే దేవుడిలాంటి మావయ్య మారిపోయాడేమో !

బుజ్జిగాడు యింకా పాలు మానలేదు. తన కప్పుడే మళ్ళీ ఆరో నెల ! తలచుకుంటే తనమీద తనకే అసహ్యం వేస్తోంది.

ఉచిత సలహా యిచ్చి ఆ పెద్దమనిషి అర్జంటు పని వున్నట్టు వెళ్ళిపోయాడు.

పొయ్యిమీద కాఫీ పెట్టింది తను.

"ఇప్పుడటే లేచేది ? నువ్వసలు సంసారం చేసే ఆడదానివటే. అవతల పెద్దమనిషి వస్తే ఓ కప్పు కాఫీ యిద్దామన్న జ్ఞానం కూడా లేదేమే మొద్దా!"

"తొందరగా మెలకువ రాలేదండీ. కాఫీ పెట్టాను" భయం భయంగా చెప్పింది.

"కాఫీకాదు నీ శార్ధం పెట్టుకోలేక పోయావా ?"

''ఏం మాటలండీ.''

''రాస్కెల్! ఎదురు మాట్లాడతావా ?'' ఎదురుగా కనిపించిన అప్పడాలకర్ర తీసుకుని తన డొక్కలో పొడిచాడు.

అకారణంగా అలా కొట్టేసరికి తనకు కోపం కట్టలుతెంచుకుని వచ్చింది. మీదపడి రక్కుదా మనిపించింది. మొగుడు కొడితే ఒళ్లు అప్పగించాలే తప్ప పెదవి విప్పకూడదని అమ్మ చెప్పిన మాటలు జ్ఞాపకొచ్చి వూరుకుంది.

''ముందు పుట్టింటికి బయలుదేరు.''

''ఇప్పుడెందుకు ?''

''చెప్పినట్టు చేస్తావా మక్కెలు విరగ తన్ననా ?''

''తన్నండి మీ యిష్టంవచ్చినట్టు.''

''నోరు విప్పావంటే చంపేస్తాను'' అంటూ బలంగా కడుపుమీద తన్నాడు.

''అమ్మా'' అంటూ తను క్రిందపడింది. బాధతో మెలికలు తిరిగింది. నిండు చూలాలన్న కనికరం లేకుండా ప్రవర్తిస్తున్న మావయ్య కసాయి తనం చూస్తుంటే తనకు రోత కలిగింది.

''లే. నీ దొంగనాటకం కట్టిపెట్టు'' తన కుడిచెయ్యి పట్టుకుని మెలితిప్పసాగాడు.

''హాస్పి ... అబ్బ ... వొద్దండి.''

''బయలుదేరతావా లేదా'' అంటూ యింకా బలంగా మెలితిప్పుతున్నాడు.

చేతి ఎముకలు ఎక్కడికక్కడికి విరిగిపోతా యేమో నన్నంత బాధగా వుంది.

''మీకు దండం పెడతాను ... అబ్బ ... వొద్దండీ...''

''ఇవాళ నిన్ను వొదలను. నువ్వు పుట్టింటికి బయలుదేరాల్సిందే. ఆ నాలుగువేలు తీసుకురావా ల్సిందే'' అంటూ మరో చేత్తో తన జుట్టును పట్టుకుని నెట్టుకుంటూ ప్రక్క గదిలోకి తీసు కెళ్లాడు.

''బయల్దేరు.'' గట్టిగా ముందుకు నెట్టాడు. గోడమీద పడబోయి రెండు చేతులతో గోడను పట్టుకుని నిలదొక్కుకుంది. లేకపోతే మొహం పచ్చడి పచ్చడి అయివుండేది. ముందు హాల్లో బుజ్జిగాడు పెద్దగా ఏడుస్తున్నాడు.

''కానీయ్ తొందరగా'' కోపంగా అరిచాడు. మావయ్య ధోరణి చూస్తుంటే తనకు భయం వేసింది. రెండు చీరెలు రెండు జాకెట్లు ఎయిర్ బ్యాగ్‌లో పెట్టింది.

''ఇహ నడువ్.''

ఎయిర్‌బ్యాగ్ పట్టుకుని లేచింది. బుజ్జిని ఎత్తుకుంది.

''వాణ్ణి దించు.''

''బుజ్జిని తీసుకెడతానండీ.''

''బుజ్జి యిక్కడే వుంటాడు. నువ్వు ఒక్క దానివే వెళ్ళు''

''వాడింకా పాలు కూడా మానలేదండీ.''

''మరేం ఫర్వాలేదు.''

''వెంట తీసుకెడతాను'' బ్రతిమాలింది, ఏడ్చింది. ఫలితం లేకపోయింది.

రిక్షా మాట్లాడాడు. ఎక్కింది. వెళ్ళమన్నాడు. రిక్షా కదిలింది. వెనక సైకిల్ మీద మావయ్య బస్‌స్టాండ్ వరకు వచ్చాడు. టికెట్ కొనిపెట్టి, కనీసం బస్ కదిలేవరకు కూడా వుండకుండా వెళ్ళి పోయాడు.

... గతమంతా జ్ఞప్తికి తెచ్చుకున్న రాధ పెల్లుబుకుతున్న కన్నీరు చీరె కొంగుతో తుడుచు కుంది. అమ్మ, నాన్న మాటలు యింకా వినిపిస్తూనే వున్నాయి.

''నా మాట జవదాటడనుకున్న నా స్వంత తమ్ముడు ఎంత ఘోరానికి తలపడ్డాడో చూడండి'' అంటూ రాజమ్మ వలవల ఏడ్చింది. పువ్వుల్లో పెట్టి చూసుకుంటా డనుకుని తమ్ముడికి కిచ్చి చేసిన రాధ జీవితం అలా అయిందన్న బాధ రాజమ్మ గుండెల్లో మంటను రేపింది.

''వూరుకోవే పిచ్చిదానా. అన్నీ మనం అను కున్నట్టు జరుగుతాయా ? ఎలా రాసిపుంటే అలా జరుగుతుంది. విధి వ్రాతను మనం తప్పించలేము. చెప్పిచూదాం. నీ మాట వినొచ్చు. వినకపోతే తర్వాత ఆలోచిద్దాం.''

కనురెప్పలు బరువెక్కి కళ్ళు మూతలు పడు తున్నాయి. యింకా వాళ్ళ మాటలు సన్నగా విని పిస్తూనే వున్నాయి.

[ఇంకా వుంది]

# వి-చికిత్స

డా. ముదిగొండ శివప్రసాద్



రాజ్యలక్ష్మి విశ్రాంతిగా పడకకుర్చీలో పడుకొని వారపత్రిక చదువుకొంటూ వుండగా అందులో 'మీరూ – మీ దేహ స్థితి' అన్న పేజీ వచ్చింది.

అది చదువుతున్నకొద్దీ రాజ్యలక్ష్మి ముఖం పాలిపోయింది. కొద్దిరోజులుగా తాను శరీరంలో ఏదో అస్వస్థత ఉన్నట్లు అనుకొంటూ వున్నది అబద్ధం కాలేదని తేలింది. కాని ఆ రోగం యింత భయంకరమైందని మాత్రం ఆమె కలలోకూడా ఊహించలేదు. ఆ పేజీలో కుష్ఠురోగ లక్షణాలు వివరించబడి వున్నాయి.

రాజ్యలక్ష్మి మోకాలి కింది భాగం గిల్లి చూచుకున్నది. స్పర్శ లేనట్లు గ్రహించింది. ఎడమ భుజంపై పుండును పరిశీలించింది. అది వెడల్పుగా పొడలు పొడలుగా మారుతున్నట్లు తెలుసుకున్నది. ఎముకలు కుంచించుకొని పోతున్నట్లు, పెదవులు మొద్దుబారుతున్నట్లు ఊహించుకుంటున్నది అసత్యం కాదని తేలింది. అంతే! కెవ్వున గావుకేక వేసి పడిపోయింది.

లోపలినుండి పరుగెత్తుకుంటూ చంద్రమౌళీ, వరహాలమ్మా వచ్చారు. అసలేమైందో యిద్దరికీ అర్థంకాక ఆదుర్దాపడుతున్నారు. రాజ్యలక్ష్మి మూర్ఛపోయిందని మాత్రం చంద్రమౌళి గ్రహించాడు. డాక్టరుకు ఫోన్ చేశాడు. వరహాలమ్మకు రాజ్యలక్ష్మిని సాధించేందుకు మరో అవకాశం దొరికింది. 'లేకపోతే ఆ శవాల పుస్తకాలు చదువుతూ అన్నాలు తినడాలేమిటే, ఆ సినిమాలు చూడడమేమిటే ఎన్నడైనా మా కాలంలో విన్నామా? కన్నామా' అని మొదలెట్టింది. డిటెక్టివులు చదవడం, సినిమాలకు వెళ్ళడం కేవలం కలికాల లక్షణాలని వరహాలమ్మ భావం. 'అమ్మా నీ సాధింపుకు సమయం సందర్భం అక్కర్లేదా?' బాగా విసుక్కున్నాడు. చంద్రమౌళి – అతని మనస్ససతే పరిపరి విధాల పోతోంది.

ఈలోగా డాక్టర్ కామాక్షయ్య వచ్చాడు. రాజ్యలక్ష్మిని పరీక్ష చేసి 'మరేం భయం లేదు. కేవలం స్పృహ తప్పింది. అంతే – మరో నాలుగైదు నిమిషాల్లో తెలివి వస్తుంది.' అని ఓ ఇంజెక్షను ఇచ్చాడు. కామాక్షయ్య చెప్పినట్లే రాజ్యలక్ష్మి ఈ లోకంలోకి వచ్చింది కాని ఆమెలో చైతన్యం ఏ కోశానా లేదు. 'ఏమ్మా ఏం జరిగింది?' ఆదుర్దాగా ప్రశ్నించాడు కామాక్షయ్య –

డాక్టరును చూచేసరికి ఆమెలోని దుఃఖం కట్టలు తెంచుకొని ప్రవహించింది.

'డాక్టరుగారూ –' అంటూ భోరున ఏడ్చింది.

'ఏడవకమ్మా – ఏడవకు ఏం జరిగిందో చెప్పు' అన్నా ప్రయోజనం కన్పడలేదు.

'డాక్టరుగారూ నన్ను మీతో తీసుకెళ్ళండి' అని ఏడుస్తున్నది రాజ్యలక్ష్మి.

'అలాగేనమ్మా – పోదాంపద' అని కామాక్షయ్య చంద్రమౌళిని పిలిచి 'చూడు చంద్రమౌళీ! అమ్మాయిని నేను మందు తీసుకుపోయి ఆందోళనకు కారణమేమిటో కనుక్కుంటాను. నువ్వో అర్ధగంట ఆగి రా' అని సూచన ఇచ్చి రాజ్యలక్ష్మితో సహా కార్లో వెళ్ళిపోయాడు కామాక్షయ్య.

క్లినిక్ చేరేక రాజ్యలక్ష్మి చెప్పిన విషయం విని కామాక్షయ్య కూడా ఒక్క క్షణం విస్తుపోయాడు. వెంటనే పరీక్షలు ప్రారంభించాడు.

పరీక్షిస్తున్నాకొద్దీ రాజ్యలక్ష్మి దేహ పరిస్థితి మరీ కాంప్లికేటెడ్‌గా కన్పడసాగింది.

లెప్రసీ వచ్చిందని తాను ఇదమిద్ధంగా తొలి పరీక్షలలో తేల్చుకోలేకపోయినా ఆమె లివర్, లంగ్స్ (ఊపిరితిత్తులు) మామూలు పరిస్థితికన్నా భిన్నంగా వున్నాయని ఊహించాడు.

'చూడమ్మా – నా వెంట ఉస్మానియాకు రా అక్కడ పరీక్షలు సాగిద్దాం' అని వ్యాన్‌తో చంద్ర

మౌళి వస్తే ఉస్మానియాకు రమ్మని చెప్పమని తాను రాజ్యలక్ష్మిని అఫ్‌జల్‌గంజ్ తీసుకుపోయాడు.

కామాక్షయ్య, అతని మిత్రులు రాజ్యలక్ష్మమ్మను పరీక్ష చేశారు. వరుసగా నాలుగైదు రకాల పరీక్షలు జరిగాయి. అవసరమైన ఎక్స్‌రే ఫొటోలూ తీశారు.

డాక్టర్ ఖాన్ మాత్రం కామాక్షయ్యతో ఈమెకు కుష్టువు లేదని గట్టిగా వాదించాడు. 'క్షయ మాట ఫొటోలు చూచేవరకు చెప్పలేను కాని కుష్టువు మాత్రం రావడానికి వీలు లేదు' అని ఖాన్ తన రోగ నిదానాన్ని వివరించాడు.

కామాక్షయ్య కూడా ఖాన్‌తో ఏకీభవించాడు. కాని డాక్టర్ సురేందర్‌రెడ్డి, యాదగిరి మాత్రం ఈమె ఇస్నోఫేలియాతో క్రానిక్‌గా అవస్థ పడుతోందని భావించారు.

'ఈమె రక్తకణాలల్లో చూడండి ఈ లక్షణాలు' అని బ్లడ్ టెస్ట్ ఫలితాలు చూపించారు కామాక్షయ్యకు.

అందరూ ఈమెకు ఇస్నోఫేలియా వుందని ఏకగ్రీవంగా అంగీకరించారు. అయితే ఇది ప్రధాన విషయం కాదుకదా! అసలు టి.బి., లెప్రసీల మాట ఏమయినట్లు ??

యాదగిరి కోపంతో అన్నాడు ''అసలీ ఇండియా ఖర్మ ఇంతే సార్ — వీళ్లు మడీ ఆచారాలంటూ ఇష్టం వచ్చినన్నిసార్లు స్నానం చేస్తారు. మాలోన్యూట్రీషన్ — ఆరోగ్య సూత్రాలసలే తెలియవు. పైగా చాదస్తాలు — లేకుంటే ఈ జబ్బులన్నీ అమెరికాలోనో ఇంగ్లండులోనో రావెందుకిలా ? — మరీ ఇగ్నోరెన్స్ — అండర్ డెవలప్డ్ కంట్రీ — నే నసలు స్టేట్స్‌లో ఉన్న కాలంలో...'' తక్కిన డాక్టర్లంతా ఇవతలికి వచ్చారు— యాదగిరి తాను స్టేట్స్‌లో వున్న కాలంలోని అనుభవాలు చెప్పడం మొదలుపెడితే కాలండర్ కాగితాలు మారిపోతాయట. ఒకసారి ఒక పేషెంట్‌కు ఆపరేషను మొదలుపెట్టి అకస్మాత్తుగా తాను స్టేట్స్‌లో వున్నప్పుడు ఇలాంటి కేసునే ఏం చేయవలసి వచ్చిందో సర్జన్లతో వివరిస్తూవుంటే ఈలోగా పేషెంటు గుడ్డుపెట్టాడట !

ఈలోగా చంద్రమౌళి వచ్చాడు.

'ఏం భయంలేదని రాజ్యలక్ష్మికి అన్నివిధాలా పరీక్షలు జరుపుతున్నా'మని కామాక్షయ్య ధైర్యం చెప్పాడు. చంద్రమౌళి అన్న రఘువీరరావు పెద్ద డాక్టరు. ఆయనకూ కామాక్షయ్యకు మంచి దోస్తీ ! అందుకే చంద్రమౌళి అంటే కామాక్షయ్యకు ప్రత్యేక అభిమానం.

డాక్టర్ల ప్రాథమిక పరీక్షల అనంతరం రాజ్యలక్ష్మికి కుష్టువ్యాధి రాలేదని తేలింది. కాగా కాలేయమూ, ఊపిరితిత్తులూ కూడా మంచిగానే వున్నాయికాని ఎందుకైనా మంచిది ఒకసారి రాయవెల్లూరు వెళ్లిరావడం మంచిదని సూచించాడు సురేందర్‌రెడ్డి.

కామాక్షయ్య మండిపడ్డాడు. 'పదిమంది వంటవాళ్లు కలిసి వంటనంతా తగలేశారన్న సామెత ఇంగ్లీషులో యిందుకే పుట్టింది. లెప్రసీ టెస్టులు పోయాయి — ఇస్నోఫేలియా వచ్చింది — దాని సంగతి తేలలేదు. టి.బి. వచ్చింది — అదీ ఎక్స్‌రేలో ఏమీ కన్పడటంలేదుకదా ఇంకా రాయవెల్లూరు ఎందుకు ?'

'ఎందుకంటే ఏం చెప్తాం సార్ ! వాళ్లు అందులో స్పెషలిష్టులు — వెళ్తే అనుమానం నివారణ అవుతుంది. ఎందుకంటే ఎక్స్‌రేలో కింది భాగంలో ఏదో ఉన్నట్లు తోస్తోందికదా !'

కామాక్షయ్యకు మళ్లీ కోపంవచ్చి 'అరే సురేందర్ ! కార్డియాలజిష్టువి నువ్వే — యిలా పామరుడిలా మాట్లాడుతావేమిటి ? నీ జన్మలో ఎన్నడైనా లంగ్ లోయర్ పార్ట్‌లో యిలాంటి సింప్టమ్స్ (లక్షణాలు) వుంటే టి. బి. అని డయాగ్నయిజ్ (రోగ నిదానం) చేయడం విన్నావా ? ఊఁ ... చెప్పు ! ఈ కేసు చరిత్రలో ఎన్నడన్నా విన్నావా ?'

కామాక్షయ్య దెబ్బలాటకు సురేందర్‌రెడ్డి తగ్గాడు. 'నిజమే ! టి. బి. అప్పర్ పార్ట్‌లోనే వస్తుంది. ఇది ఏదైనా ఇన్‌ఫెక్షన్ అయితే కావచ్చుకూడా ! అయినా ముందు జాగ్రత్తగా ఏదో నాకు తోచింది నేను చెప్పాను. తర్వాత మీ యిష్టం.'

'ఇష్టంకాదయ్యా — అ వ త ల నష్టం ! పేషెంటు అసలు తనకు లెప్రసీ వుందన్న భయంతోనే హిస్టీరికల్‌గా తయారైంది. కేసును మనం మరీ కాంప్లికేట్ చేస్తే ఎలా ? !

'ఓకే. ఓకే.' సురేందర్‌రెడ్డి ఊరుకున్నాడు కాని యాదగిరి మాత్రం ఇలా అన్నాడు అనుమానంగా 'కనీసం ఇస్నోఫేలియాకు, హిస్టీరియాకు ట్రీట్ చేయడం మంచిదికదా !'

కామాక్షయ్య రాజ్యలక్ష్మిని ప్రశ్నించాడు 'చూడమ్మా నీకేం కూర ఇష్టం !'

'వంకాయ.'

'వింటర్ (శీతాకాలం)లో కూడా వంకాయ తింటుంటావా !'

'అన్ని కాలాల్లోనూ డాక్టరుగారూ.'

'ఇంకేంమరి ! శీతాకాలంలో ఇస్నోఫేలియా వస్తుంది వంకాయ తింటే ! ఆఁ... అన్నట్లు ఈ సీజన్‌లో మీకు ఊపిరి పీల్చుకోవడంలో ఏదైనా ట్రబుల్ వుంటుందా ?'

'అవునండీ — కొంచెం బరువుగా తీస్తాను గాలి — కాస్త మసుకు చేస్తే చాలు ఊపిరి ఆడనట్లుండదు.'

కామాక్షయ్య ఈ లక్షణాలు ఆధారంగా యాదగిరితో చర్చించాడు. 'ఈమెకు ఆస్మా సూచనలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. బహుశా ఫొటోలో లోయర్ పార్ట్‌లో ఆ మసక కన్పడడానికి అది కారణం కావచ్చు' అన్నాడు యాదగిరి.

'ఆస్మా అని మనం ఎందుకు నిర్ణయించాలి ? ఇస్నోఫేలియాలో కూడా ఇలాంటి సింప్టమ్స్ (లక్షణాలు) ఉండవచ్చుకదా !' కామాక్షయ్య వాదించాడు.

'ఇది తర్వాత తేల్చుకోవచ్చు కాని తనకు కుష్టువు వుందన్న భయంతోనే ఈమె హిస్టీరికల్‌గా తయారైంది కదా — ఆ నరాల బలహీనత మాటేమిటి ? ?'

యాదగిరి భయంతో, కామాక్షయ్య ఏకీభవించాడు. 'దానిని సైకాలజీ స్పెషలిష్టులతో తర్వాత సంప్రదించవచ్చు' న్నాడు.

''కాన్పులు ఎక్కువ కావడంతో ఈమె బలహీన పడిపోయి వుండవచ్చు — అందుకని కుటుంబ నియంత్రణ వార్డుకు పంపడం మంచిది'' అని సూచించాడు యాదగిరి

'అవిడకింకా బిడ్డలు పుట్టందే !' అన్నాడు కామాక్షయ్య.

''అలా చెప్పండి — అదీ అసలు సంగతి — బిడ్డలు లేరన్న బెంగతో ఆమె హిస్టీరికల్‌గా తయారైంది.''

మొత్తానికి అప్పటికి రాజ్యలక్ష్మికి ఏ వ్యాధి వుందో స్పష్టంగా తెలియని దశలో హాస్పటల్ నుండి డిస్చార్జ్ చేయబడి ఇంటికి వచ్చింది.

ఇంటివద్ద వరహాలమ్మ ఒకటే హడావుడి పడిపోతోంది. చంద్రమౌళికి కూడా ఏమి చెప్పాలో తెలియలేదు — 'ప్రస్తుతానికి ఏం జబ్బో తెలియలేదు' అని ఆమాటే చెప్పాడు చంద్రమౌళి.

'అసలింతకూ పిల్ల ఎందుకు మూర్ఛపోయింది.'

'... ... ... ... ...'

'ఏమిరా అబ్బాయీ...'

'ఏం లేదమ్మా — దానికి కుష్టువు వుందేమోనని అనుమానం వచ్చింది.'

'కుష్టు...వా...పెద్దరోగమే !' వరహాలమ్మ గగ్గోలుపెట్టింది — ఇంచుమించు మూర్ఛపోయినంత పని చేసింది.

భార్య సంగతి అయింది, ఇక తల్లిని పేషెంటు నెంబరు 'టూ'గా పంపాల్సి వస్తుందేమోనని భయపడ్డాడు చంద్రమౌళి.

'అ మ్మ నా య నో య్ ! కొంపమునిగిందిరా తండ్రీ ! పెద్దరోగమే ప్రవేశించిందిరా యింట్లో ! ఇక మా వంశం గతేమికానురోయ్ నాయినో !'

వరహాలమ్మ ఏడుపుకు పక్క ఇళ్లవాళ్లూ కిరాయివాళ్లూ వీధిని పోయేవాళ్లు కూడా ఒకసారి తమ దృష్టిని ఇటు మరల్చక తప్పలేదు.

'అమ్మా ! అమ్మా ! ఊరుకో అమ్మా ! మరీ అసభ్యంగా ఏమిటీ రభస ! ఎవరైనా వింటే నవ్విపోతారు.'

'నా సంసారమూ బతుకే నవ్వులపాలైంది రోయ్ ! నాయనోయ్ ! లేకుంటే ఎన్నడైనా మన వంశ చరిత్రలో ఈ పెద్ద రోగం విని ఎరుగుదుమా తండ్రీ ! అసలా కాకరాలవారి సంబంధం చేసుకున్నప్పుడే నే ననుకున్నాను ఇనపగజ్జెల తల్లి నా కొంపలో అడుగుపెడుతోందని !'

'అమ్మా ! ఏమిటిది ?'

'ఏ మి టి లే దు గీమిటిలేదు ! అది ఈ యింట్లోకి రావడానికి వీలులేదు. ఏ సామాను ముట్టడానికి వీలులేదు. దానిని ఏ దవాఖానాలో నన్నా చేర్పించు ! లేదా వేరే గది కిరాయికి తీసుకొని అందులో పడెయ్యి.'

'హుం ... స్వంత అత్తగారే తరిమితే కిరాయికి ఇల్లెవరిస్తారమ్మా ఈ ప్రపంచంలో !'

'ప్రపంచం మాట నాకు తెలీదు. నాకింక ఈ కాకరాలవారి జెష్టతో సంబంధంలేదు. దానికి భరణమిచ్చి పంపెయ్ ! వేరే సంబంధం రేపేవేళకు చూస్తాను.'

చంద్రమౌళి మండిపడ్డాడు తల్లి అగడానికి.

(30 వ పేజీ చూడండి)

# * సినిమా విశేషాలు *



"ఆది మానవులు"లో వేంకట రమేష్

## కొత్త కాపురం

నటి భారతిని హీరో కృష్ణ చెంపదెబ్బ కొట్టారు. ఎందుకంటారేమో తన అన్నయ్య చంద్రమోహన్‌పై దొంగతనం ఆరోపించారనే కోపంతో ఆవేశాన్ని చంపుకోలేక, ఆత్మాభిమానాన్ని వదలుకోలేక అత్తగారింట్లో ఎడా, పెడా మాట్లాడుతుంది భారతి. కృష్ణ, భారతి ఆవేశాన్ని తగ్గించడానికి చెళ్లున చెంపదెబ్బ కొట్టారు. పై సంఘటన యదార్థం కాదు. కానీ యదార్థమే ఎందులో అని అడగరేం. అదే ప్రసన్నలక్ష్మి పిక్చర్స్‌వారి "కొత్త కాపురం" చిత్రంలో. సన్నిహితంగా వున్న భార్యా భర్తల మధ్య పేచీ లెందుకొచ్చాయో తెలియచేయడానికే జి. వెంకటరత్నం "కొత్త కాపురం" చిత్రాన్ని నిర్మించారు.

పి. సి. రెడ్డి దర్శకత్వంలో తయారౌతున్న ఈ చిత్రంలో పైవాళ్లు కాకుండా గుమ్మడి, పద్మనాభం, అల్లు రామలింగయ్య, రాజనాల,

## పుట్టింటి గౌరవం

శ్రీ వాణీ ఆర్ట్ కంబైన్స్ నిర్మించిన "పుట్టింటి గౌరవం" త్వరలో అన్నపూర్ణా ఫిలింస్ ద్వారా విడుదలవుతుందన్న విషయాన్ని, మరో కొత్త చిత్రాన్ని తలపెట్టిన నిర్మాత ఎన్. వి. సుబ్బరాజు చెప్పారు. కృష్ణంరాజు నటన పరాకాష్ఠ నందుకొన్న నిజాన్ని "పుట్టింటి గౌరవం" చిత్రాన్ని చూచిన ఎవరూ కాదనలేరు. అతగాడి చెల్లెలుగా శుభ ప్రేక్షకులచేత సెహభాష్ అనిపించుకోవడము కూడా తథ్యము మరో ముఖ్య పాత్రను పోషించిన రావుగోపాలరావును ప్రజలు మెచ్చుతారు. భారతి పాత్రలో కొత్తదనం వున్నది.

ఇల్లరికం వచ్చిన అల్లుళ్ళుగా అల్లు రామలింగయ్య, సాక్షిరంగారావు, పద్మనాభం కడుపుబ్బ నవ్విస్తారు. వాళ్లచేత వూడిగం చేయించిన గయ్యాళి అత్తయ్యగా సూర్యకాంతం నటించింది. సహాయ పాత్రలను పుష్పకుమారి, ప్రభాకరరెడ్డి, సునందిని, సత్యప్రియ, గోకిన రామారావు పోషించారు. "గీత" ప్రసాద్ రాతను మార్చే వేషం యిందులో లభించింది. ఈ చిత్రానికి మోదుకూరి జాన్సన్ రచనను, సత్యం సంగీతాన్ని, రావ్‌చవుదరి ఛాయను, చలం కళను, మహేశ్వరరావు కూర్పును నిర్వహించారు. పి. చంద్రశేఖరరెడ్డికి పేరును తెచ్చే చిత్రం "పుట్టింటి గౌరవం."

## కొత్తది రంగుల చిత్రం!

శ్రీ వాణీ ఆర్ట్ కంబైన్స్ అధినేత ఎన్. వి. సుబ్బరాజు తలపెట్టిన కొత్త చిత్రం ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మింపబడుతుంది. కథను నిర్మాత వ్రాయ, మాటలను మోదుకూరి రాయనున్నట్టు తెలిసింది. దర్శకుడు పి. చంద్రశేఖరరెడ్డి.

ఈ చిత్రంలో కృష్ణంరాజు, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, అల్లు రామలింగయ్య ముఖ్య తారాగణం. హీరోయిన్ వేషానికి కొత్తమ్మాయిని వెతుకుతున్నారు. జనవరి నుండి షూటింగు ఆరంభం.

సంవత్సరానికి తన తరపున రెండు చిత్రాలను నిర్మించాలన్న నిర్ణయాన్ని తీసుకోవడానికి గల కారణాన్ని సుబ్బరాజు వివరించారు. తన సంస్థను నమ్ముకున్న వ్యక్తులకు గ్యాప్ రానికుండా వుండాలన్నదే. (సముచిత నిర్ణయం!)

ఈ చిత్రానికి టి. భరద్వాజ, ఇ. ఎస్. రెడ్డి నిర్మాతలు.

నిర్మాణ విలువలు, దర్శకత్వపు విలువలు, నటనా ప్రమాణాలు, కథాబలము వున్న "చిన్ననాటి కలలు" ప్రేక్షకులను ఆకట్టుకోవడం తథ్యము.

## భారతి

మనోరంజనీ పిక్చర్స్ నిర్మిస్తున్న "భారతి" చిత్రం ముగ్గురికి మహర్దశను ప్రవిచూపించాలి. పీటూరికి దర్శకుడిగా సుస్థిరమైన స్థానాన్ని, లతకు నటిగా మంచి డిమాండ్‌ను, నిర్మాత కె. వి. రెడ్డికి ప్రజల్లో పలుకుబడిని పెంచగల సామత "భారతి" చిత్రానికి వున్నదని చెప్పడానికి నేను సంశయించడంలేదు.

స్వర్గీయ రంగారావు ధరించిన ఆనందరామయ్య పాత్రను గూర్చి వ్రాయనా, కృష్ణంరాజు నటిస్తున్న నాయకుడి వేషం గూర్చి వివరించనా, 'కళాభారతి' జమున నిర్వహించిన శీలవతి భూమికను గూర్చి ప్రశంసించనా, సత్యనారాయణ చేపట్టిన తేనె పూసిన కత్తి పాత్రను గూర్చి పదిమాటలు రాయనా అని వూనుకుంటే, యివన్నీ తెలపడం వుచితం అనిపిస్తున్నది. ఇవన్నీ నిజాలని ప్రేక్షకులు తీర్పు నిచ్చిననాడు "భారతి" చిత్రానికి విలువ పెరుగుతుంది. హాస్యనటుడు పద్మనాభం సరికొత్త పాత్రను ఈ చిత్రంలో పోషించారు. చంద్రమోహన్—రమాప్రభ — అల్లు రామలింగయ్యగారల కాంబినేషన్‌లో ప్రత్యేకత అగుపిస్తుంది. ఇక పాటలంటారా — భువిని వదిలి వెళ్లిన కోదండపాణి కసికొద్దీ చేసిన నిజం ప్రతి పాటలో వినిపిస్తుంది. ఈ చిత్రం విజయా కంబైన్స్ ద్వారా విడుదలవుతుంది.

## పరివర్తన

సుభాషిణీ ఆర్ట్ పిక్చర్స్ నిర్మించిన యీ చిత్రం నవంబరు నెలలో విడుదలవుతుంది అన్నారు నిర్మాత, దర్శకుడు హేమాంబరధరరావు. నవలా రచయిత్రి మాదిరెడ్డి సులోచన విరచితమైన "అంతం చూసిన అసూయ" కథ "పరివర్తన" చిత్రానికి ఆధారం. ఈ చిత్రానికి భమిడిపాటి మాటలను, చలపతిరావు సంగీతాన్ని సమకూర్చారు.

ప్రధాన పాత్రలను కృష్ణంరాజు, జమున, లక్ష్మి, చంద్రమోహన్, శ్రీధర్, కాంచన, రాజబాబు, పండరీబాయి, ప్రభాకరరెడ్డి, రావికొండలరావు పోషించారు.

అసూయ ఎంత దారుణానికి దారితీస్తుందో, ఈర్ష్య ఎంత పతనానికి మార్గం చూపిస్తుందో "పరివర్తన" కథలోని లక్ష్మి పాత్ర తెలియచేస్తుంది. ఈర్ష్యా ద్వేషాలకు ప్రతిరూపంగా భాసిల్లిన లక్ష్మి జీవితంలో "పరివర్తన" తెచ్చినది ఎవరు? కృష్ణంరాజా, చంద్రమోహనా, జమునా లేక కాంచనా?

చిత్రం ఆద్యంతం బిగువైన సన్నివేశాలతో, సున్నితమైన హాస్యంతో, సుమధుర సంగీతంతో నిండియుండడంవల్ల "పరివర్తన"కు ప్రజాదరణ లభించే యోగం వున్నది.

## మల్లెమాల సాహిత్యం - సత్యం సంగీతం

కౌముదీ పిక్చర్స్ నిర్మించే "రామయతండ్రి" చిత్రంలో నిర్మాత మల్లెమాల (యం. యస్. రెడ్డి) మూడు ముచ్చటైన పాటలను రచించారు. అందుకు స, రి, గ, మ, లు సృష్టించారు సత్యం. ఆ మూడు పాటల పల్లవి కనండి.

"మల్లె విరిసిందె" అనే పాటను సుశీల, "గున్నమామిడి గుబురులోన" అనే పాటను బాలు, సుశీల, "అమ్మ, నాన్నకు పెళ్లి, ఎన్నో ఏళ్ళకు మళ్లీ" అనే పాటను సుశీల, జానకి ఆలపించారు. సుళువైన భాషలో రెడ్డి పాటలను వ్రాస్తే, దాని కనువైన స్వరాలను సమకూర్చారు సంగీత దర్శకుడు సత్యం. ఈ చిత్రానికి బి. వి. ప్రసాద్ దర్శకుడు. విజయా విడుదల. ప్రభ, సత్యనారాయణ, రంగనాథ్, జయంతి, రాజబాబు, నిర్మల ఈ చిత్రంలో ముఖ్య పాత్రధారులు.

సంగీత దర్శకుడు సత్యం స్వల్ప కాలంలోనే సమర్థుడు అన్న పేరు సంపాయించాడు. అతని స్వరాల్లో నరాలకు కిక్ నిచ్చే శక్తి వుంటుంది. పాటలను రక్తి కట్టించడానికి పాటు పడ్డాడు అనే ధోరణి కన్పడుతుంది. సంవత్సరానికి కనీసం ఆరు చిత్రాలకు తక్కువ పని చేయడు. ఇప్పటికి 90 చిత్రాలకు సంగీత దర్శకత్వం వహించాడు. ప్రస్తుతం పి. యస్_ఆర్. పిక్చర్స్, శ్రీ వాణీ ఆర్ట్ కంబైన్స్, భవానీ ఆర్ట్స్, చక్రపాణి మూవీస్, టి. వి. యస్. ఇంటర్ నేషనల్ మున్నగు సంస్థల చిత్రాలకు స్వరాల కర్తగా పని చేస్తున్నాడు సత్యం.

"కథానాయకుని కథ"లో వాణిశ్రీ, భారతి

కృష్ణకుమారి, రమాప్రభ, సూర్యకాంతం, అ్మత, హేమలత, [illegible] భానుమతి, బేబీ శ్రీదేవి ముఖ్య పాత్రలను పోషించారు. పూర్ణా విడుదల చేసే ఈ చిత్రానికి బొల్లిముంత మాటల రచన్ను, మహదేవన్ స్వర రచన్ను, లక్ష్మణ్ గోరే ఛాయను, చలం కళను, మహేశ్వరరావు కూర్పును, పి. బ్రహ్మానందరావు సహాయ దర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు.

### ఈ ఏడు కృష్ణంరాజు !

నటించిన చిత్రాల్లో 90 శాతం నిర్మాతకు డబ్బు తెచ్చిపెట్నాయి. ఇప్పటికి మూడు వంద రోజుల చిత్రాలు యీయన నటించిన వాటిలో వున్నాయి. ''అనగనగా ఒక తండ్రి, బంట్రోతు భార్య, కృష్ణవేణి'' చిత్రాలు అత్యధికంగా ప్రజాదరణ పొందగలిగాయి. ఈ మూడు గాక ''ఆడపిల్లల తండ్రి, ఇంటి కోడలు, హారతి'' చిత్రాలు కాస్తో కూస్తో లాభాలను తెచ్చిపెట్టకపోవు.

ప్రజలలో కృష్ణంరాజుపై ప్రత్యేక గౌరవం ఏర్పడడానికి కారణం లేకపోలేదు. ప్రతి చిత్రంలో తను నటుడిగా పెరుగుతున్న నిజాన్ని నటన ద్వారా చూపెడుతున్నాడు. వెరైటీ వేషాలను వేస్తూ, ప్రజలకు దగ్గరివా డవుతున్నాడు. ఇతగాడి చిత్రాలకు ప్రేక్షక ఆదరణ లభిస్తుందన్న నమ్మకం పరిశ్రమ ప్రముఖులకు ఏర్పడింది. పెద్ద నిర్మాతలు యితగాడి చేత మంచి చిత్రాలను నిర్మించే వుద్దేశ్యంలో వున్నారు.

ఈ ఏడు కృష్ణంరాజు జాతకం చాలా సంతృప్తికరంగా వుంది. వచ్చే ఏడు యింకా బాగుండాలని నేను కాంక్షిస్తున్నాను.

### అక్కినేనితో భారీ చిత్ర నిర్మాణం

''నటసామ్రాట్'' నాగేశ్వరరావు యిచ్చే తేదీలకు అనుగుణంగా భారీ వర్ణ చిత్ర నిర్మాణం జరుగుతుంది అన్నారు సుబ్బరాజు. ఎన్నాళ్లనుంచో ఆయనతో సినిమా తీయాలన్న ఆశ నెరవేరే మంచి రోజు దగ్గర్లోనే వుంది. ఈ చిత్రానికి పి. సి. రెడ్డి దర్శకుడు.

### ప్రతికోణ పోటీ !

ధ్రువ చిత్ర వారి ''చిన్ననాటి కలలు'' చిత్రం గూర్చి భలే గొప్పగా చెప్పుకొంటున్నారు. తమ్మారెడ్డి కృష్ణమూర్తిగారి చిత్రాలలో కథకు ఎక్కువ ప్రాధాన్యత వుంటుందన్న నిజాన్ని ఎవరూ కాదనలేరు. ఈ చిత్రానికి లెనిన్‌బాబు దర్శకుడు. పాటల చిత్రీకరణలో యితగాడికిసాటి యితడే అన్న బిరుదం ''దత్తపుత్రుడు, డాక్టర్‌బాబు'' చిత్రాలు తెచ్చిపెట్టాయి. ''చిన్ననాటి కలలు'' చిత్రంలో లెనిన్‌బాబు ప్రతాపం ఆద్యంతం అగుపిస్తుంది.

''చిన్ననాటి కలలు'' చిత్రంలో కృష్ణంరాజు, జయంతి, ప్రమీల మధ్య పోటీ ఉధృతంగా జరిగినట్టు తెలుస్తూంది. నటనలో ఎవరు నెగ్గారో నిర్ణయించాల్సింది ప్రేక్షకులే. ఈ చిత్రంలో గుమ్మడి. రావుగోపాలరావు, కె. వి. చలం, రమాప్రభ, పుష్పకుమారి, అల్లురామలింగయ్య ముఖ్య తారాగణం.

భీశెట్టి లక్ష్మణరావు రాసిన కథకు పినిశెట్టి మాటలను సమకూర్చడం జరిగింది. చలపతిరావు సంగీతంలో స్పెషల్ యింటరెస్టు కనిపిస్తుంది. ఛాయాగ్రహణాన్ని వి. ఎస్. ఆర్. కృష్ణారావు నిర్వహించారు. లక్ష్మి ఫిలింస్ ద్వారా విడుదల అయ్యే



# సినిమా

## శోభన్‌బాబు నేపాల్ పయనం

ఆంధ్రులకు రోజా రోజుకి దగ్గరివా డవుతున్న శోభన్‌బాబు, భవిష్యత్తులో బంగారు పంటను చవి చూడబోయే మంజుల నేపాల్‌కి పయనం అయ్యే అవకాశాన్ని సమత ఆర్ట్సు అధినేతలు ఛటర్జీ, యాదేంద్ర కలిగించారు.

ఇంతవరకు దక్షిణ దేశంలో ఏ నిర్మాత యీ లోకేషన్ను వుపయోగించుకోలేదు. డిశంబరులో



"దేవుడుచేసిన పెళ్లి"లో

పక్షం రోజులపాటు నేపాల్‌లో మకాం పెట్టి, మూడు పాటలను, కొన్ని ముఖ్యమైన సన్నివేశాలను చిత్రీకరించగలరని తెలిసింది.

"జేబు దొంగ"గా నటిస్తున్న శోభన్, అతడి ప్రియురాలిగా నటిస్తున్న మంజుల, హాస్య నటుడు రాజబాబు, రోజారమణి, మురళీమోహన్ మరియు సత్యనారాయణ యీ నేపాల్ షెడ్యూలులో పాల్గొనే తారాగణం.

ఆద్యంతం ఆసక్తిని, హుషారును కలిగించే "జేబు దొంగ" చిత్రంలో గ్లామర్ హీరో ధరిస్తున్న పాత్రలో ప్రత్యేకత వున్నది. ఈ చిత్రానికి విక్టరీ మధుసూదనరావు దర్శకుడు. ఎస్. వెంకటరత్నం ఎంతటి ప్రతిభాసంపన్నుడో "మంచి మనుషులు" నిరూపించింది.

## శోభన్ అదృష్టం !

"నటసామ్రాట్" నాగేశ్వరరావుకు చాలా యిష్టమైన కథ "మా యిద్దరి కథ." ఈ చిత్రంలో నటించే అదృష్టం శోభన్‌బాబును వెతుక్కుంటూ వెళ్లింది.

ఆరోజు శుక్రవారం. అక్టోబరు 18 ఉదయం ఎనిమిదిగంటల సమయం. మూర్తి మేడు హైరోడ్డు లోని "శాంతి" భవంతికి "కథానాయకుడు" చిత్ర నిర్మాత కె. గోపాలకృష్ణ ఆగమనం.

"మా ఇద్దరి కథ" చిత్రం యొక్క వైశిష్ట్యాన్ని శోభన్‌బాబు వినడం. కథను విని ముగ్ధుడై తప్పక చేస్తానని మాట యివ్వడం జరిగింది. శోభన్ నట జీవితంలో కలికితురాయిగా నిలిచే రెండు పాత్ర లున్న చిత్రం. వచ్చే ఏడు మే నెల నుండి షూటింగు ప్రారంభం అయ్యే ఈ చిత్రానికి కె. హేమాంబరధర రావు దర్శకుడు. ఈ చిత్రానికి ఆరుగురు రచయితలు ట్రీట్‌మెంటును తయారుచేశారు. సంగీతానికి చక్రవర్తి, కళకు బి. ఎస్. కృష్ణ, ఛాయా గ్రహణానికి ఎస్. వెంకటరత్నం కర్తృత్వం వహించ గలరని తెలిసింది.

"మా ఇద్దరి కథ" చిత్రంలో శోభన్ ద్విపాత్రాభినయం ప్రత్యేక ఆకర్షణగా వుండగలదు. మనిషిలోని "మంచి–చెడు" లకు ప్రతిరూపమే ఈ కథ అని కథకుడు గోపాలకృష్ణ చెప్పారు. ఒకడు రాముడైతే, మరొకడు కృష్ణుడు.

## బలిపీఠం

అది అరుణ నివసించే ఇల్లు.

కన్నకొడుకును చూడాలని వుత్సాహంగా లోపలి కొచ్చాడు భాస్కర్. తండ్రి రాకను, కూతురు జ్యోతి తల్లికి తెలియచేసింది.

అరుణ : జ్యోతీ, కాళ్లు కడుక్కురమ్మని చెప్పు.

భాస్కర్ : సారీ, అరుణా, మర్చిపోయాను. అంటూ ఎంతో జాగ్రత్తగా పొత్తిళ్లలో బాబును చేతుల్లోకి తీసుకుని ఆనందంగా బిడ్డను చూసి మురిసిపోతూ, 'అచ్చు నీ పోలికే' అన్నాడు భార్యకేసి.

'బుద్ధులు కూడా నావే రావచ్చు' అందావిడ.

'నీ మాటలు మాత్రం రానివ్వకు' అన్నాడు భాస్కర్.

'మీ చేతలుమాత్రం రావు' అని అరుణ సమాధానం పలికింది.

భాస్కర్ : అవును. నా చేతలే కనిపిస్తాయి. కాని నువ్వు చేసేవి.

అరుణ : రాయి పైకి విసిరితేనే క్రిందికి పడుతుంది.

భాస్కర్ : తప్పు నాదే నంటావ్ ?

అరుణ : ఆ మాట పదిసార్లడగక్కర్లేదు.

భాస్కర్ : చెయ్యి చేసుకోవడమేగా నే చేసిన తప్పు.

అరుణ : దానిదేముంది. ఎవరికి చేతనైంది వాళ్లు చేస్తారు.

భాస్కర్ : అరుణా. నువ్వూ పాప లేకపోతే యిల్లెంత బోసిగా వుందో తెలుసా ? మనింటికి వెళదాం రా అరుణా అంటూ ఆమెవంక ప్రాధేయ పూర్వకంగా చూశాడు. ఆమె ముభావంగా ముఖం పెట్టింది. "కట్" అన్నారు దర్శకుడు దాసరి నారాయణరావు. ఈ బిగువైన సన్నివేశం రవిశంకర్ ఆర్ట్ పిక్చర్స్‌వారి వర్ణ చిత్రం "బలిపీఠం"లో కనిపిస్తుంది. భాస్కరరావుగా శోభన్, అరుణగా శారద



"పరివర్తన"లో లక్ష్మి, కృష్ణంరాజు



ఇది జాగ్రత్తగా చదవండి
ఎల్లప్పటికి ప్రపంచములో అతి శీఘ్రమైన, ఎంతో విజయవంతమైన బోడీ షేపర్
ఈ ప్రజలు 15 రోజులలో
37.45 కిలోలు వరకు తగ్గినారు
ఏని కార్సన్ 4.4 కిలోలు తగ్గారు
డెష్టిల్ అన్యుయ్యార్ 4.2 కిలోలు తగ్గారు
శీలా కుమార్ 4.5 కిలోలు తగ్గారు
మైకెల్ ఫెర్నాండెజ్ 3.95 కిలోలు తగ్గారు
జెయిటీ పహిలా 5.1 కిలోలు తగ్గారు
ముకుందన్ మీనన్ 5.1 కిలోలు తగ్గారు
ఎమిల్డా పూరీ 4.9 కిలోలు తగ్గారు
అనిమేష్ ముఖర్జీ 5.3 కిలోలు తగ్గారు
ముందు బరువు 54.7 కిలోలు
ముందు బరువు 64.5 కిలోలు
ముందు బరువు 53.5 కిలోలు
ముందు బరువు 68 కిలోలు
ముందు బరువు 55.7 కిలోలు
ముందు బరువు 69.2 కిలోలు
ముందు బరువు 56.5 కిలోలు
ముందు బరువు 66.3 కిలోలు
తదుపరి బరువు 50.3 కిలోలు
తదుపరి బరువు 60.3 కిలోలు
తదుపరి బరువు 49 కిలోలు
తదుపరి బరువు 64.5 కిలోలు
తదుపరి బరువు 50.6 కిలోలు
తదుపరి బరువు 64.1 కిలోలు
తదుపరి బరువు 51.6 కిలోలు
తదుపరి బరువు 61 కిలోలు
రూయీ మాసర్ మీ నడుము, పిరుదులు, తొడలు, 9 నుండి 10 సెం.మీ. తగ్గటానికి మీకు సహాయం చేస్తుంది. దానికి హామీ ఇవ్వబడింది. ఎందుకంటే రోజువారీ కలుగుతున్న మార్పును మీరు కొలవ వచ్చును.
new from America
మేడమ్ రోచన్ Rui Maceour* 5 Minute Body Shaper
రూయీ మాసర్‌తో మీరు కూడ రోజుకు ఒక పౌను తగ్గవచ్చును
RM.14.TEL
ఇప్పుడు ఎలా పనిచేసిందో చూడండి. వేల మంది సన్నబడ్డారు... మీరెందుకు కాగూడదూ?
మీకు రెండు విధాల గ్యారంటీ ఇస్తున్నాము కారణం విశ్వవిఖ్యాతి పొందినదని నిరూపిస్తుంది గాన!
గ్యారంటీ నం: 1
14 రోజులలో క్రమమైన, కొలచబడే ఫలితాలు. మీరు ఎన్ని పౌనులు తగ్గింది, ఎన్ని అంగుళాలు తగ్గింది చూచి 100% తృప్తి చెందుతారు. లేక అనగా తృప్తి చెందకపోయిన రూయీ మాసర్ బోడీ షేపర్ త్వరగా పంపిన డబ్బు వాపసు ఇవ్వబడగలదు.
(పోస్టేజి & ప్యాకింగ్ మినహాయించి)
గ్యారంటీ నం: 2
ఈ అత్యద్భుతమైన రూయీ మాసర్ 5 నిమిషాల బోడీ షేపర్, సులభమైన, సురక్షితమైన మరియు మీకు సంతృప్తి నిచ్చే ఫిగర్ ట్రిమ్మర్ లభించును.
మీరు కొన్ని అంగుళాలు తగ్గునట్లు పనిచేయండి
న్యూ యార్క్ టైమ్స్ మరియు గుడ్ హౌస్-కీపింగ్ మొదలగునవి సూనా రాప్స్, ఇన్‌ఫ్లేటెడ్ బెల్టులు, మరియు వరితూగవజే బెల్టులను బయల్పరచాయి. కాని శాస్త్రీయ పరిశోధనదారులు, వైద్య నిపుణులు అందరు ఒప్పుకున్నారు...మీ శరీరమునకు ఒక రూపు, ఆకారం రావాలంటే ఒక్కటే మార్గం...మీరు కొన్ని అంగుళాలు తగ్గునట్లు పనిచేయాలి. నేడే రూయీ మాసర్ వ్యాయామాన్ని ప్రారంభించండి.
అసహ్యంగా లావుగా ఉండే భాగాలు మిమ్మల్ని మీ వయస్సు కంటే పెద్ద వారిగా కనబడేటట్లు చేస్తాయి
మీరు స్త్రీగాని, పురుషుడుగాని అవ్వచ్చును గాని అసహ్యంగా లావుగా వుండే భాగాలు మిమ్మల్ని వృద్ధులుగా వుండేటట్లు చేస్తుంది. మేడమ్ రోచన్ యొక్క రూయీ మాసర్ బోడీ షేపర్ తిరిగి మిమ్ములను యౌవనవంతులుగాను, సొగసైన, ఇంకా ఎక్కువ సెక్సీ రూపానికి ఒక్క 21 రోజులలోనే తీసుకు వస్తుంది. రూయీ మాసర్ మీ నడుము, పిరుదులు మరియు తొడల లావును కొన్ని అంగుళాలు తగ్గించి వేస్తుంది.
"రూయీ మేసర్ నా లావు తగ్గటానికి చాలా సహాయపడింది—అందమైన మోహన రూపం నాకు ఇవ్వగల్గింది".
ప్రత్యేక తగ్గింపు ధర
అవును, నాకు తగ్గాలని ఉంది నాకు నా శరీరానికి సెక్స్ అపీల్ ఇవ్వాలని ఉంది
డబ్బు తిరిగి ఇవ్వబడును అన్న హామీతో సమర్పణ
'ఆ లావును అతి త్వరగా తగ్గించుకోండి' తర్వాత కొలవ దగిన, ఖచ్చితమైన ఫలితాలను 14 రోజులలో చూడండి. అల్లా కాకపోతే మీ డబ్బు వాపసు కోసం (పోస్టేజి, పేకింగ్ మినహాయించుకొని) మా వ్యాయామ వస్తువును, కోర్సును మాకు తిరిగి పంపెయ్యండి.
MADAME ROCHON, 612, CHURCHGATE CHAMBERS, NEW MARINE LINES, BOMBAY-400 020.
దయ చేసి నాకు పంపండి ● రూయీ మాసర్ బోడీ షేపర్‌ను రూ. 58/-లకు.
రెండు వారాల హామీ క్రింద.
☐ మని ఆర్డర్ ☐ చెక్ ☐ వి.పి.పి. ☑ కావలసినది టిక్ చేయండి. కలుగకపోతే 2 వారాలలో పూర్తి డబ్బు వాపసు కోసం (పోస్టేజి మరియు పేకింగ్ మినహాయించి) నేను తిరిగి పంపగలను. నేను వి.పి.పి. ద్వారా ఆర్డరు చేయు చున్నాను. పోస్ట్‌మేన్‌కు డబ్బు యిస్తానని హామీ యిస్తున్నాను. రూ. 58/- మరియు రూ. 4/- వి.పి.పి. ఛార్జీలు. దయచేసి స్పష్టంగా వ్రాయండి.
NAME ____ AGE ____
ADDRESS ____
CITY ____ STATE ____
Cheques / Money Orders should be made in favour of ROSS MURARKA INDIA PVT. LTD.
RM/ASVP/15/11
కత్తిరించి వెంటనే పంపండి.



''దేవదాసు''లో కృష్ణ

## సినిమా

పోటీపడి నటించారు. ఏ. శేషగిరిరావు సమర్పించ, సుశీల్ నిర్మించే యీ చిత్రానికి నవయుగ పంపిణీ దారులు.

### చక్రవర్తి పెళ్లాడే బొమ్మ

అనగానే ఏ చక్రవర్తి, ఎవర్ని పెళ్లాడబోతు న్నాడు అనే సందేహం కల్గుతుంది వీరాకు. ఈ ''పెళ్లాడే బొమ్మ''ను ఏ చక్రవర్తి వివాహం చేసు కోవడం లేదు. పి. శ్రీనివాస్, గూడూరు వెంకట్రామయ్య నౌదరి, పి. చంద్రశేఖర్ను ఊర్వశీ మూవీస్ బ్యానరుపై తయారుచేస్తున్న చిత్రం పేరే ''పెళ్లాడే బొమ్మ.'' ఈ చిత్రానికి ''గుండెలు తీసిన మొనగాడు'' చిత్ర దర్శకుడైన చక్రవర్తి నిర్దేశకుడు. యువకరక్తంకదా అందుకే అక్టోబరు మొదటివారంలో మొదలుపెట్టి రెండు షెడ్యూల్స్ చేసి సగం చిత్రానికిపైగా పూర్తిచేసాడు చక్రవర్తి ఇప్పటికే.

### సుశీల, బాలుల డ్యూయెట్టు

పై చిత్రంలో నటి భారతికి క్రొత్తతరహా పాత్ర నివ్వబడింది. భారతి, రంగనాథ్‌ను ప్రేమి స్తుంది. రంగనాథ్ తక్కువతిన్నాడా? భారతి ప్రేమ పాఠాలకు పల్లాయి పాడాడు. సినిమాలో ప్రేమాయణం అంటే పాట లేకుండా ఆనందాన్ని అనుభవించలేరుగా. అందుకే వారిద్దరికని ''పిలిచే ప్రేమగీతం—వలపే జీవనాదం, చెలికావి సన్నిధానం— సఖేని-అమరధామం'' అనే ప్రేమగీతాన్ని వ్రాసారు రుద్ర. ఆ గీతానికొక చక్కని బాణీని కూర్చి, సుశీల, బాలుచేత పాడించారు సంగీత దర్శకుడు సత్యం. గిరిబాబు, కాంతారావు, పద్మనాభం, అల్లు రామలింగయ్య, రావికొండలరావు, ఆనందమోహన్, గోకిన రామారావు, హలం ముఖ్య పాత్రధారులైన ఈ చిత్రానికి దేవేంద్ర (సినిమా రచయితగా మొదటి ప్రవేశం) రచన్ను, కన్నప్ప ఛాయను, కోటగిరి గోపాలరావు కూర్పును, కళాకర్ కళను పోసగుతున్నారు.

### ఆదిమానవులు

పదైనా నిండని యీ బాలు డెక్కడ? బలిసిన కొండచిలువ ఎక్కడ? ఆ కొండచిలువ మదమణచ డానికి, సుకుమార శరీరం గొన్న బాలుడు పడిన ఆరాటం వృధా పోలేదు. దాంతో భయంకరంగా పోట్లాడి, దానిని నేలమట్టం చేసిన యీ వింత బాలుడు ఎవరకో?

చేతనా కంబైన్స్‌వారి వర్ణ చిత్రం ''ఆది మానవులు''లో చిరంజీవి వెంకట రమేష్ చేసిన సాహస కృత్యాలలో కొండచిలువను చంపడం ఒకటి. ఈ భయంకర దృశ్యాన్ని చూడడానికి పదివేలమంది గుమికూడారు. కళ్లప్పగించి చూశారు కొందరు. కుర్రవాడ్ని కావలించుకుని ముద్దాడారు మరికొందరు. కుర్ర టార్జాన్ అని మరికొందరు. మాట ప్రయో గించారు. కాటమరాజు—మనుమసిద్ధి ఢీకొన్న రణ రంగ ప్రదేశం అనగా కనిగిరి కొండపైన యీ భీకర దృశ్యం చిత్రీకరించబడింది. వజ్జె సుబ్బారావు నిర్మి స్తున్న యీ చిత్రానికి జి. కె. మూర్తి దర్శకుడు.

### చలం చిత్రంలో కొత్త నాయిక

శ్రీ సారథి అండ్ చలం కంబైన్స్ నిర్మిస్తున్న ''తోటరాముడు'' చిత్రం మొదటి షెడ్యూలు జరుగ డంతో ఆరు రీళ్లు తయారైంది. జరగవలసిన షూటింగంతా అవుట్‌డోర్‌గాబట్టి వరుసగా నెల రోజులు ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ పట్టణాలలో జరప డానికి నిర్మాత జి. డి. ప్రసాదరావు నిశ్చయించారు.

ధనిక, శ్రామికవర్గానికి నడుమ జరిగే సంఘ ర్షణ సారమే ''తోటరాముడు'' కథ. ఈ కథకు పినిసెట్టి మాటలను రాశారు. సాంకేతిక శాఖలను సత్యం, ప్రకాష్, అంకిరెడ్డి, సోమనాథ్, రాజానంబి నిర్వహిస్తున్నారు. ''ముత్యాల ముగ్గు'' ఫేమ్ బి. వి. ప్రసాద్ దీనికి దర్శకుడు.

నటుడు చలం సమర్పించు యీ చిత్రంలో సుచిత్రఅనే కొత్తనటి హీరోయిన్‌గా నటిస్తున్నది. ముఖ్య పాత్రలను చలం, ప్రభాకరరెడ్డి, త్యాగరాజు, సాక్షి రంగారావు, కె. వి. చలం, చిట్టిబాబు, బాల క్రిష్ణ, పండరీబాయి, రమాప్రభ, పి. ఆర్. వరలక్ష్మి (యింటికోడలు)పోషిస్తున్నారు. శ్రీ ఫిలింస్ విడుదల.

— శ్రీనివాస్

''రామయ తండ్రి''లో ఒక సన్నివేశం






# మీరు చవిచూసే ప్రతి హనీ బీ బ్రాంది గుటకలోనూ ఫ్రాన్సు యొక్క చిన్నభాగం ఉంది

ఏకకాలిన ఫ్రెంచి, భారతదేశపు ద్రాక్షపళ్ళ బ్రాండీలలోంచి ఉత్కృష్టంగా బ్లెండు చేయబడినది.



హనీ బీ బ్రాందీ చవిచూడండి
ఒక్క సారి ఫ్రాన్సుకి వెళ్ళిన అనుభవాన్ని పొందండి

## హనీ బీ బ్రాంది

ఆ ఫ్రెంచి అనుభూతి కోసం!



మార్కెట్ చేయువారు హెర్ బర్ట్ సన్స్ లిమిటెడ్
బాటిల్ చేయువారు మేక్ డొవెల్ డిస్టిలరీస్

బాగా మొఖం వాచేటట్లు చివాట్లు పెట్టాడు ఆమె అతివాగుడుకు అప్పటికికాని ఆమె ఉధృతం కొంత తగ్గలేదు అయితే ఈ భీభత్సమంతా చూచిన రాజ్యలక్ష్మి మాత్రం కొయ్యబారిపోయింది —

తనకింక ఈ యింట్లోనేకాదు ఈ లోకంలోనే స్థానం లేదని నిశ్చయించుకుంది

చంద్రమౌళి మెల్లగా తల్లితో రాజ్యలక్ష్మికే జబ్బూ లేదని చెప్పి ఒప్పించగలిగాడు కాని రాజ్యలక్ష్మి మాత్రం ఇక సమాధానపడే స్థాయిని దాటిపోయింది—

ఆమె సంతృప్తికోసం గత్యంతరంలేక విశాఖ కింగ్‌జార్జిలో చూపించాడు అక్కడ చంద్రమౌళి వేలువిడిచిన మేనమామ రామబ్రహ్మం పని చేస్తున్నాడు ఆయన పరీక్షించి రాజ్యలక్ష్మి ఆరోగ్యం స్వచ్ఛంగా నిర్మలంగా మానస సరోవరంలా ఉందనీ ఆమె నిర్భయంగా అన్నీ తిని హాయిగా తిరగ వచ్చుననీ చెప్పాడు

ఆ తర్వాత రాయవెల్లూరు —

అక్కడా కొన్ని నెలల పరిశీలనల అనంతరం రాజ్యలక్ష్మి సంపూర్ణారోగ్యవంతురాలేనని నిర్ధారింపబడింది

సుప్రీంకోర్టు తీర్పులా రాయవెల్లూరు నిర్ణయం వచ్చినా రాజ్యలక్ష్మి మనస్సులో దృఢంగా నాటుకున్న రోగ భయం మాత్రం వదలలేదు తనకు మొత్తానికి ఏదో ఒక జబ్బు ఉండితీరాలనే ఆమె భావన

సరే! చివరి మజిలీ ఢిల్లీ యాత్రకూడా చేశారు ఢిల్లీలోనే చంద్రమౌళి అన్న రఘువీరరావు వున్నాడు

అకస్మాత్తుగా వచ్చిన తమ్ముణ్ణీ మరదలినీ చూచి ఢిల్లీలోని ఆసియా 72 చూడడానికి వచ్చారని భావించాడు రఘువీరరావు

ఏమమ్మా ఎలావుంది నీ ఒంట్లో అని మామూలుగానే ప్రశ్నించాడు

ఏం చెప్పను బావగారూ! నా పరిస్థితి రోజు రోజుకూ అయోమయంగా తయారౌతున్నది అన్నది రాజ్యలక్ష్మి

ఆదేమమ్మా! నీకు ఆరోగ్యం బాగానే ఉందని తమ్ముడు జాబు వ్రాశాడే అన్నాడు రఘువీరరావు

చంద్రమౌళి జరిగిన చరిత్ర మొత్తం పూసగుచ్చినట్లు చెప్పాడు

రఘువీరరావు నవ్వి ఇదుగో చూడు మన వాళ్ళు ఇంటిగుట్టూ — వ్యాధిరట్టు అని అన్నారే కాని వ్యాధినిలా మరీ ప్రచారంచేస్తే అరిటిచెట్టులా అది రోజూ ఎలకలు పెట్టుకొంటూ కొత్త కొత్త రోగాల కిందికి పెరిగిపోతుంది అన్నాడు

రఘువీరరావు వైద్యంలో ఎంత నేర్పరో మాటలలో అంత చమత్కారి అని ప్రతీతి— అసలాయన ట్రీట్‌మెంట్ సగానికిపైగా మాటలలోనే వుందట!

రాజ్యలక్ష్మిని పరీక్షచేసి నిజంగానే ఆమెకే జబ్బూ లేదని స్వయంగా నిర్ధారణ చేసుకున్నాడు రఘువీరరావు

అయినా రాజ్యలక్ష్మికి అనుమానమే!

ఎవరంటే రఘువీరరావు క్యాన్సర్ స్పెషలిష్టు

## వి— చికిత్స

[23వ పేజీ తరువాయి]

ఆయనకు అల్సర్స్ గూర్చి ఆస్త్మా గూర్చి లెప్రసీ, టి బి ఇస్నోఫీలియల గూర్చి పూర్తిగా తెలిసి వుంటుందా? రఘువీరరావు రాజ్యలక్ష్మికి ఏ జబ్బూ లేదని ఆత్మవిశ్వాసం కలిగేటట్లు ఎన్నోమార్గాల నచ్చజెప్పాడు ఎన్నో ప్రమాణాలూ ఉపపత్తులూ చూపించాడు

అయితే ఈ పొడల మాటేమిటి?

ఏమిటమ్మా మరీ పసిపిల్లలా మాట్లాడుతావు? ఏ చర్మవ్యాధి వచ్చినా పొడలు రావచ్చు — తామర రావచ్చు దానికి జాలిమ్‌లోషన్ చాలు ముప్పావలా మందుతో పోయేదానికి అప్పడే మూడు వేలు తగలేశారు

మరీ పెదవులు మొద్దుబారడం

చలికాలంలో పెదవులు మొద్దుబారుతాయి — పగులుతాయి — అదీ ఒక జబ్బేనా?

రాజ్యలక్ష్మికి సంజాయిషీలేవీ సంతృప్తి కల్గించలేదు



మరి ఊపిరాడకపోవడం?

జలుబు — కేవలం రొంప పడిశం లక్షణం యిది కాస్త విక్స్‌వేపరబ్ కాని అమృతాంజనం కాని పట్టిస్తే సరిపోయేది

బావగారూ! ఇదేమీ నాకు ఆత్మవిశ్వాసాన్ని చేకూర్చడంలేదు

రఘు వీరరావుకూ ఇప్పుడదే సమస్యగా తయారైంది

ఆమెకు ఏ జబ్బూ లేదంటూ ఏ మందూ ఇవ్వకుండా పంపిస్తే ఊరుకునేటట్లు కన్పడలేదు— రోగం ఏదో వుందనే బలమైన భావం ఆమె రక్తనాళాల్లో జీర్ణించుకొనిపోయింది

దానిని ఉపపత్తులతోనూ ఊరడింపులతోనూ తీసివేయడం అసాధ్యం!!

రఘువీరరావు ఏరే సని ఆమెను తన క్లినిక్‌లో రెండు రోజులు రాత్రింబవళ్ళు పరిశోధించారు ఆ తర్వాత మరో నాలుగైదు రోజులు వివిధ డాక్టర్లతోనూ స్పెషలిష్టులతోనూ సంప్రదించారు

అమ్మాయ్! సోమవారం ఉదయం నీగూర్చి నా పరిశోధనా వివరాలు ఇస్తాను అన్నాడు

రాజ్యలక్ష్మి చంద్రమౌళీ ఆ సోమవారంకోసం వేయి కళ్ళతో ఎదురుచూశారు

ఆదివారం రాత్రి అసలు రాజ్యలక్ష్మికి నిద్రే పట్టలేదు

— సోమవారం!

తెల్లవారింది—

రాజ్యలక్ష్మి కాఫీ తాగిన వెంటనే వెళ్లి బావగారి గదిలో కూర్చున్నది

ఆయన చాలా బరువుగా నిట్టూర్చి అమ్మాయ్ — నా తీవ్ర పరిశోధనలవల్ల నీకు జబ్బు వున్నదనే తీర్మానానికి వచ్చాను అన్నాడు

రాజ్యలక్ష్మి మనస్సు ఇప్పుడు హంసలా ఈదుతున్నది పావురంలా ఎగురుతున్నది

బావగారూ బావగారూ

అవునమ్మా! నీకు జబ్బు లేదనడం అబద్ధం అంతా ఈ విషయంలో పొరపాటు పడ్డారనే చెప్పడానికి విచారిస్తున్నాను

చూచారా చూచారా కసితోనూ బాధతోనూ తన మాటే నెగ్గిందన్న పంతంతోనో రెట్టించి రెట్టించి పలికింది చంద్రమౌళితో

చంద్రమౌళి—ఏమీ మాట్లాడలేదు—

అమ్మాయ్ — నీకోసం ప్రత్యేకమైన మందులు తెప్పించాను కాంపోజ్ అనే ఔషధం తెప్పించాను ఇదికాక అనిబెన్‌సాల్ అనే అత్యాధునికమైన మందు అమెరికా నుండి తెప్పించాను

బావగారూ! ఇంతకీ నాకే జబ్బు?

ఇది నిరోసిస్ అనే ఒక ప్రత్యేకమైన జబ్బమ్మా! దానివల్లనే ఇలా ఆస్త్మా టి బి లెప్రసీ — ఇస్నోఫేలియా టెటనస్ (ధనుర్వాతం) వూ ఇలా ఎన్నో ఎన్నో వచ్చే అవకాశాలున్నాయి—

అయితే బావగారూ! నాకు తగ్గుతుందంటారా?

తగ్గనిదే నిన్ను ఢిల్లీ నుంచి పంపుతానా తల్లీ!

రాజ్యలక్ష్మి హమ్మయ్య అని నిట్టూర్చింది—

ఇన్నాళ్లకామె మొదటిసారిగా తృప్తిగా ఆపూటే భోంచేసింది

తనకు జబ్బు వుందన్న బావగారి తీర్పు ఆమెకిచ్చినంత తృప్తి ఇన్ని వందలమంది స్పెషలిష్టుల నిర్ణయాలు కూడా ఆమె కివ్వలేదు

భార్య కిచన్‌లోకి పోయాక చంద్రమౌళి అన్న ముఖం చూస్తూ వుండిపోయాడు అయోమయంగా!

రఘువీరరావు చిలిపిగా నవ్వాడు

అన్నయ్యా

ఏమిట్రా?

ఇదేమిటన్నయ్యా యిలా చెప్పావు?

అవున్రా నేను చెప్పింది నిజమే!

అయితే ఆమెకు జబ్బేమిటి? అయినా ఒకే కారణంతో టి బి లెప్రసీ ధనుర్వాతం అన్నీ ఎలావస్తాయి?

అవును తమ్ముడూ వస్తాయి — ఎందుకు రావు? మనం రమ్మంటే వస్తాయి - వద్దంటే రావు

నాకేం బోధపడటం లేదన్నయ్యా! మరీ అయోమయంగా వుంది

ఏముంది తమ్ముడూ! మీ ఆవిడకు తనకేదో జబ్బు వుందనే భ్రమ ఒకటి ఆపాదించింది ఏ రోగ లక్షణాలు చదివితే అవి తనకే ఉన్నయ్యని భావించే ఒక భ్రమ! మరి ఇలాంటి భ్రమ వుంటే చాలదా అన్ని జబ్బులూ వచ్చినట్లే నిజంగా బాధపడటానికి— నేను చెప్పిందీ అదే ఏ జబ్బూ లేకున్నా ఏదో జబ్బు వుందనుకునే జబ్బు ఒకటి రాజ్యలక్ష్మిని ఆవహించింది నిరోసిస్ అని ఓ పేరు కూడా పెట్టాము మేము కాంపోజ్ అనిబెన్‌సాల్ వంటి మందులూ తతంగమూ అంతా దీనికి మేము జరుపుతాము ఇదీ కధ అన్నాడు రఘు వీరరావు చిరునవ్వు నవ్వుతూ

# లాలస

(18 వ పేజీ తరువాయి)

నాడు డబ్బుకి లోటేమిటి? కష్టాలు కలకాలం వుంటాయా చెప్పు

మగవాడు భార్యని తనకి నచ్చినవిధంగా మలుచుకోవాలి అంతే గాని నీ అభిరుచులకి తగ్గట్టు లేదనుకోవటం అవివేకం స్త్రీ ఒక చక్కటి వాయిద్యం లాంటిది అది విద్వాంసుడి చేతుల్లో రాగ సుధలు పలుకుతుంది అవిద్వాంసుడి చేతుల్లో మూగబోతుంది, అపశ్రుతులు పలుకుతుంది అంటే ప్రతిభ వాయిద్యంలోనిది కాదు విద్వాంసుడి యొక్క 'విద్వత్'లోనిది కాదంటావా?'' అన్నాడు

''లేదు రమేష్! కాదని ఎలా అనగల్ను? నువ్వు నాకళ్లు తెరిపించావు నా మనసుకి పట్టిన మాయమబ్బుల్ని తొలగించావు థాంక్సురా నా అవివేకంతో ఒక అమూల్య రత్నాన్ని చేజార్చుకోకుండా నాకు దక్కించావ్ నాలోని అజ్ఞానాన్ని పారద్రోలావ్!'' అన్నాడు పశ్చాత్తప్త హృదయంతో అసలు అవి అన్ని శ్రీనివాస్‌కి తెలియనివి కావు కాని అతడు ఆ విధంగా ఆలోచించలేదు అంతే! అది ఒక మూర్ఖత

''ఒరేయ్! నేను ఒక్కమాట చెప్తున్నా విను! ఈ సంగతి విని నువ్వు అసహ్యించుకున్నా ఫరవాలేదు మన క్లాస్‌మేటు సునీత నీకు గుర్తుందా! ఆ అమ్మాయి నేనంటే పడి చస్తుంది ఆ అమ్మాయి ధనవంతుల బిడ్డ నేను తల్చుకుంటే ఆమె మెళ్లో మూడుముళ్లు వెయ్యటం ఏమంత కష్టం కాదు కాని రేపు నాకేం సుఖం? అంతెందుకు? నా మేరేజి సెటిలయిందని తెలిశాక నాకు లవ్ లెటర్ వ్రాసింది అసలు ఆవిడ చాలా మందితో సంబంధం పెట్టుకుందని వినికిడి పైగా అస్తమానం స్వేచ్ఛా స్వాతంత్రం అంటూ లెక్చర్లిస్తుంది అదేనా స్వేచ్ఛంటే? పైగా మనతో సమానంగా చదివిన అమ్మాయిని మనం కొంచెం కూడా అదుపులో పెట్టి ఆజ్ఞాపించలేం ఏదైనా గట్టిగా మన అధికారం భర్తగా చూపించ బోయినా—గివ్ అండ్ టేక్ రెస్పెక్టు—అంటుంది అదీ నిజమే! కాదంటే వెళ్లిపోతుంది ఆవిడకి మన మీద ఆధారపడవలసిన అవసరం ఏమిటి? మన ఆధిక్యత ఏం వుంటుంది? తగాదాలు చిలికి చిలికి గాలివానలు అవుతాయి ఇద్దరు డాక్టర్లు అభిప్రాయాలు కలవ్వు అంటారు ఆ యిద్దరూ భార్యా భర్తలయితే ఇంకేముంది లేదూ అంటే భార్యకి సమాన హోదా గౌరవం ఇచ్చేటంత ఔదార్యం మనకి వుండాలి మనకి అంతటి వున్నత సంస్కారం వుందని నేననుకోను నా మటుకు నాకు లేదు నా భార్య నాకు అణిగి మణిగి వుంటేనే నా కానందం నాకంటే ఆమె అన్ని విధాల తక్కువ అయితేనే నాకు తృప్తి ఇది కుసంస్కారమే కావచ్చు స్వార్థమే కావచ్చు ఏమో నా మనఃప్రవృత్తి అటువంటిది అంతెందుకు? రేపు నీ భార్యనిన్ను ఎదిరించితే నీవు సహిస్తావా? నీవు తిరిగి ఏదైనా అంటే చదువుకున్నభార్యపడుతుందా? ఇలా చెప్పాలంటే చాలా వున్నాయి కొన్నిచెపితే బాగుండవు ఎవరి అభిరుచుల్నిబట్టి, పరిస్థితుల్నిబట్టి నడుచుకోవాలి అంతే! అసలు ఇదంతా ఎందుకంటే ఇకముందైనా నీవు నీ భార్యని ఆదరించమని వేడికోలు''అన్నాడు

''ఇప్పటికే తలవంచుకోవాల్సిన పరిస్థితి ఇంకా వేరే చెప్పాలా రమేష్''అన్నాడు శ్రీనివాస్ సిగ్గు బాధ మిళితమయిన స్వరంతో

''అవును చెప్పాలి అప్పుడే నాకు తృప్తి'' అన్నాడు రమేష్ చిన్నపిల్లవాడిలా మొఖం పెట్టి ఇద్దరుమిత్రులు హాయిగా నవ్వుకున్నారు

ఆ రోజు సాయంత్రానికల్లా ఇంటికి వచ్చేశాడు శ్రీనివాస్ నూతనోత్సాహంతో పెళ్లి నుంచి తిరిగి వచ్చిన భర్తని చూసి ఆశ్చర్యపోయింది అనూరాధ శాంత పెళ్లికి రావటానికి పరీక్షలన్నాడు మరి అటువంటిది స్నేహితుని పెళ్లికి ఎలా వెళ్లారో అనుకుంది మనసులో రావటం తప్పించుకుందుకు పరీక్షలని అడ్డు వేశారని గ్రహించుకుంది కాని వచ్చినప్పట్నుంచి అనూరాధకి కాస్త సన్నిహితంగా మెసులుతున్నాడు ఆమె మీద అతనికి అభిమానం ఏర్పడింది భర్త మొఖం ఎప్పుడు కనుపించినా అనూరాధకి ప్రసన్నంగా నే కనిపిస్తున్నది

పదిరోజుల క్రితం అనూరాధ, గీత ఒకరోజు ఇ ఎ ఐ యల్ కాలనీకి వెళ్లి వస్తుంటే బస్ స్టాపులో అనూరాధకితెలుసున్న ఒకముసలాయన కనుపించాడు ఆయనది అనూరాధ మేనమామ సత్యన్నారాయణ వాళ్ల వూరే! అదే వీధిలోనే కూడా వుంటాడు పలకరింపులయ్యాక ఆయన మాటల మధ్య చెప్పిన విషయం విని నివ్వెరపోయారు వదినా మరదళ్లు ఇద్దరూ ''శాంత ప్రవర్తన మంచిది కాదనిభర్త అనుమానించి

# పురాణ వైరాగ్యం

ధర్మపథం

ముబసు వేంకటరమణయ్య

మన దేశంలో పల్లెల్లోనూ, పట్టణాల్లోనూ కూడా కొన్ని చోట్ల సమర్థులైన విద్వాంసులు పురాణ కాలక్షేపం చేస్తూ ఉంటారు అందులో మత విషయాలూ, ధర్మములూ, నీతులూ ఆ యా సందర్భాలలో చెప్పబడుతూ ఉంటాయి వాటిని వినడానికి చాలామంది పురాణం చెప్పే స్థలానికి వెళ్లడం జరుగుతుంది

పురాణ శ్రవణానికి వెళ్లే వ్యక్తులలో ఎన్నో రకాలవారు ఉండవచ్చు కొందరు పౌరాణికులు చెప్పే విషయాలను గ్రహించడానికి వెళ్తారు కొందరు 'పురాణ శ్రవణానికి మేం కూడా వెళ్లేము' అని ప్రచారం చేసుకోడానికి వెళ్తారు 'రేపు పురాణానికి వస్తారుకదా! అప్పుడు అక్కడ ఈ విషయాన్ని గురించి మాటలాడుకొందాం' అని మరో వ్యవహారానికి దాన్ని రంగంగా ఏర్పరచుకొని, తమ పనులు చక్కబెట్టు కొనడానికి వెళ్తారు అయితే శ్రద్ధగా పురాణం విని, పౌరాణికులు చెప్పే విషయాలను గ్రహించడానికి వెళ్లే వారి పంఖ్యయే ఎక్కువ అని అనుకోవచ్చును

పౌరాణికులు మనస్సుకు నచ్చే విధంగా అనేక విషయాలను చెప్పినప్పుడు ఆయన ఉపదేశాన్ననుసరించి న్యాయంగానూ, ధర్మంగానూ ప్రవర్తించాలనీ, లౌకిక విషయాలపై వ్యామోహం పెట్టుకోకూడదనీ మనస్సులో నిశ్చయం ఏర్పడుతుంది అక్కడ ఉన్నంతసేపూ మరే ఆలోచనా



ఉండదు కాని, కాలక్షేపం ముగిసి, ఇంటిముఖం పట్టేటప్పుడు బస్సుకోసం తహతహ, 'క్యూ' ను తప్పించుకుని/ ముందుకు పోవాలనే దురాలోచన ఇంటికి పోయాక సంసార విషయంలో తాపత్రయం మొదలైనవి యథాప్రకారంగానే ఉంటాయి పౌరాణికుల ఉపదేశం విస్మృత మౌతుంది ఇది లో౦ పరిపాటి

దీనికి పరమహంస ఒక చక్కని దృష్టాంతాన్ని తెలియజేశారు

ఎవరయినా గాలి నింపిన మెత్తని మెత్త వుండే కుర్చీపయి కూర్చున్నప్పుడు ఆ మెత్త ఎత్తు తగ్గి అణగిపోతుంది మనిషి కూర్చున్నంతసేపూ ఆ మెత్త అణగి ఉంటుంది మనిషి లేచిపోతే తిరిగి ఎత్తుగా అవుతుంది

ఈ విధంగానే పురాణం విన్నంతసేపూ మంచి బుద్ధి ఏర్పడి ఆ స్థలం విడవగానే వెనకటి ధోరణే ఏర్పడుతుంది

ఆ విధంగా మార్పు జరగకుండా వుండేరీతి తీవ్రమైన పట్టుదలవల్ల ఏర్పడుతుంది అందుకోసం సర్వ విధాలా యత్నించడం అవసరం

---

పుట్టింటికి పంపేశాడుట!" కారణం ఇదమిద్ధంగా ఎవరికి తెలియదుట! ప్రస్తుతం మోహన్ ఒక నెల రోజులు సెలవు పెట్టి ఎక్కడికో వెళ్లాడుట ఆ తరువాత ఏ సంగతి తేలుస్తారుట — అని చెప్పాడాయన ఆ విషయం విన్నాక అనూరాధకి నవనాడులు కృంగిపోయినట్లనిపించింది ఇంకా పెళ్లి అయి నిండా ఏడాది కూడా కాలేదు అయినా అతనికి అనుమానమెందుకు రాను? శాంత మంచి పిల్ల దాని సంసారం చూసి తను ఆనాడు ఈర్ష్య పడింది తన దృష్టే తగిలిందేమో! అని కించపడింది నాకంటే చిన్న పిల్ల అప్పుడే దాని బ్రతుకు అట్లా అయిందేమిటి? ఆ లెక్కని చూస్తే నా బ్రతుకే మెరుగ్గా వుంది, అనుకుంది నిర్వికారంగా శాంత లేత వదనం కన్నులముందు కదులాడింది అత్తయ్యకి మామయ్యకి అది ఒక్కగా

## లా‌, ల-స

నొక్క పిల్ల వాళ్లెంత కుమిలిపోతున్నారో కదా! ఛ ఛ ఏం పెళ్లిళ్లు, ఏం సంసారాలు? అనుకుంది విరక్తిగ గీత కూడా చాలా ఆశ్చర్యపోయింది ఈ సంఘటన విని బరువెక్కిన హృదయాలతో ఇల్లు చేరారు

* * *

శ్రీనివాస్ టవల్ చుట్టుకుని బాత్‌రూమ్‌లోకి వెడుతుంటే

"ఒరేయ్ శ్రీనూ! ఇవాళ స్నానం కాదు తలంటుకోవాలి" అంది తల్లి

"అబ్బ ఇవాళ కుదర్దే నాకు పనుంది" అన్నాడు

'నీకు పని లేనిదెప్పుడూ ఇవాళ అంటుకు తీరాల్సిందే అనూరాధకి కూడా పోస్తాము" అంది తలెత్తి వారగా చూశాడు చెల్లెలు తల వంచుకుని నవ్వుతూ కనిపించింది నిన్న తండ్రి అనూరాధకి ఒక తెల్లటి జరీ అంచు చీర, తనకి పాంటు షర్టుకి క్లాత్ తేవటం చూశాడు విషయం గ్రహింపుకి వచ్చింది అతనికికూడా చిన్నగా నవ్వువచ్చింది ఆపుకుంటూ సీరియస్‌గ "సర్లె! అయితే అదేదో తొందరగ కానీయి" అన్నాడు

కొడుకు బుద్ధిమంతుడల్లే ఒప్పుకునేసరికి ఆ తల్లి ప్రాణం కుదుట పడింది ఇప్పటికే రెండుసార్లు పెట్టిన ముహూర్తాన్ని వీల్లేదన్నాడు మళ్లీ వాయిదా వేస్తాడేమో, అసలు ఆ పిల్లని చివరికి సరిగా చూస్తాడో చూడడో అని బెంగపెట్టుకుంది పైగా ఈ సంగతి వియ్యాలవారికి తెలిస్తే ఎంత అప్రదిష్ట! వీడిమూర్ఖపు పట్టుదలవల్ల చూస్తూ చూస్తూ ఒక ఆడపిల్ల గొంతు కోస్తామేమో అని భయపడింది ఆవిడ కాని

ఏ కళ నున్నాడో కొడుకు ఒప్పుకునే సరికి ఆవిడకి కొండంత సంబరం వచ్చింది

"మా నాయనే! ఎన్నాళ్ళకి నా మాట విన్నావురా శ్రీనూ! నువు ఎలాగయినా బంగారు కొండవిరా! ఒసేయ్ గీతా! ఇంకా అలాగే నుంచోకపోతే లోపలికెళ్ళి నూనెగిన్నె, స్టూలు తేకూడదూ" అంటూ అదిలించింది

"ఏమిటేవ్ మీ అబ్బాయిని మరీ అంత ముద్దు చేసేస్తున్నావ్!" అని అన్నగారి కేసి తిరిగి నడుంమీద చెయ్యి వేసుకుని, తర్జనితో అదిరిస్తూ "ఒరేయ్ అన్నయ్యా! నువ్వు ఇవాళ ఇలాగే అమ్మ చెప్పినట్లు విన్నావంటే నువు బంగారు కొండవి' అంది హాస్యంగా

" వినకపోతేనో " అన్నాడు కొంటెగా శ్రీనివాస్

"వినకపోతేనా ఓః వినకపోతే ఇత్తడి కొండవి" అంది

"అలాగా! అయితే నేను బంగారు కొండనే అవుతానే అమ్మా" అన్నాడు పకపకా నవ్వుతూ శ్రీనివాస్ మా నాయనే మా నాయనే! అంటూ మురిసి పోయింది తల్లి

గీత లోపలికి వెళ్ళి స్టూలు తెచ్చి వేసింది శ్రీనివాస్ బనీను విప్పి పాత తువ్వాలు కట్టుకున్నాడు శ్రీనివాస్ మంచి స్ఫురద్రూపి! చక్కటి ఆరోగ్యమయిన శరీరం డాక్టరంటే ఇలా వుండాలి' అనేలా వుంటాడు తెల్లగ బలిష్టమయిన ఛాతీ మీద నల్లని వెంట్రుకలు గుబురుగ అల్లుకుని వున్నాయి చేతితో జబ్బలు రాచుకుంటూ వచ్చి స్టూలు మీద కూర్చున్నాడు తల్లి తలమీద నూనె అంటింది గీత ఓణీ నడుంచుట్టూ బిగించి పరికిణీ కొంచెం పైకి మడిచింది గిన్నెలో షీకాయపొడి వేసి, బకెట్ లోకి నీళ్ళు తోరిపింది "ఒరేయ్ అన్నయ్యా! వేడి చూసుకోరా" అంటూ కాసిన్ని నీళ్ళు అన్న కాళ్ళ మీద పోసింది

"ఒసేయ్! మరీ వేడిగా పోశావంటే తన్నేస్తాను" అన్నాడు

"ఒరేయ్! శ్రీనూ! ఇవాల్టికి కాలేజీ మానెయ్యరా" అంది తల్లి

"అబ్బ మానెయ్యటం మాత్రం కుదర్దే" అన్నాడు

"అయితే సాయంత్రం నాలుగింటి కల్లా ఇంట్లో వుండాలి"

"ఓ యస్ " అన్నాడు

"ఎందుకురా వుండటం" అంది గీత

"ఏమో! నాకేంతెల్సు అమ్మ వుండమంది వుంటున్నాను" అన్నాడు

(ఇంకా వుంది)




# మధ్యతరగతి మధురస్వప్నం

కొండముది శ్రీరామ చంద్రమూర్తి

తలలో మల్లెలు తురుముకుని, జపాన్ నైలెక్స్ చీర కట్టుకుని చేతులకు రెండు జతల బంగారు గాజులు వేసుకుని, మెళ్ళో మూడు పేటల చంద్రహారంతో క్రొత్తగా చేయించుకున్న నల్లపూసల గొలుసు జతకలిపి మురిపిస్తుండగా, నొసటి మీద అల్లల్లాడుతున్న ముంగురులను

—తీర్చి దిద్దుకున్న తిలకం చెరిగిపోకుండా అలవోకగా సర్దుకుంటూ, గేటుదగ్గర నిలబడి అస్తమిస్తున్న సూర్య కాంతిలో ఎర్రగామెఱిసి పోతూ, ఎంతకూ ఇంటికిరాని భర్త కోసం కొంచెం కోపంతోనూ మరి కొంచెం విసుగు తోనూ ఎదురు చూస్తూ నుంచున్నది కరుణ

ఆకాశంలో రకరకాల పక్షులు ఎగురుతున్నాయి పలుచోట్లనుండీ రకరకాల ధ్వనులు వినబడుతున్నాయి ఎదురుగావున్న వేపచెట్టు కొమ్మలు రెమ్మలు సాచి గంభీరంగా కప్పిస్తున్నది వేప చెట్టు క్రింద, పసితనం వదలని పిల్లలు కొందరు రకరకాల ఆటలతో తమ లోకంలో తాము వున్నారు

సాయంకాలంపూట పాలు పోసే పాలమనిషి వచ్చి ఎదురింట్లో పాలుపోసి, సైకిలెక్కి బెల్లు వాయించుకుంటూ వెళ్లి పోతున్నాడు

ఆరుదాటిన సూచన

ఇంకా మన్మథ ఇంటికి రాలేదు

లోపలనుంచి ప్రాంతీయ వార్తలు వినబడడం ప్రారంభమైంది

ఆరూ అయిదు

దూరంగా ఎవరోసైకిలుమీద వస్తున్నారు బహుశ మన్మధే కావచ్చు! కరుణ ఆశగా, విప్పారిన కళ్లతో ఆ వస్తున్న వ్యక్తి వేపు చూసింది ఉహూ, కాదు అతను మన్మథ కాదు, అదే సందులో చివర ఇంట్లో వుంటున్న, కలెక్టరాఫీసు గుమాస్తా

మన్మథా, అతనూ దూరానికి ఒకలాగే కనిపిస్తారు—ఖర్మ!! ఆ వీధిలో ఆ ఇద్దరికి సైకిళ్లు వున్నాయి మిగిలిన వాళ్లలో చాలా మందికి స్కూటర్లు ఒకళ్లిద్దరికి కార్లు!!

కరుణ నిరాశపడి, తల తిప్పుకున్నంతలో—

ఎదుటింటి వరండాలో నుండి స్కూటరు కిందకు దింపుతూ సుధాకరం కనిపించాడు అతనికి ప్రక్కన విచ్చుకున్న మందారంలా, సుధ నిల్చుని వున్నది

సుధాకరం ఏదో జోక్ వేసి వుంటాడు సుధ పెద్దగా నవ్వుతోంది! 'ఆ జోక్, ఒంటరిగా నిలబడ్డ తనను గురించి అయి వుండదు కదా'

అనాలోచితంగానే కరుణ బుజం నిండుగా పమిట కప్పుకుంది

స్కూటర్ స్టార్ట్ చేయడానికి సుధాకరం కొంచెం శ్రమ పడుతున్నాడు అది మొరాయిస్తోంది

"కార్బన్ పట్టినట్టుంది!" అన్నాడు నొసటన ప[illegible] చెమటను తుడుచుకుంటూ

"కొంపతీసి, ఇప్పుడు గాని క్లీనింగ్

మొదలుపెట్టారు కదా? అన్నది సుధ, గోముగా

"ఐ కాన్ట్సే!"

సుధాకరం చోక్ వేశాడు యిక్సలటం రెయిజ్ చేశాడు ఒకటి రెండు కిక్‌లు బలంగా ఇచ్చాడు నిద్రమత్తు వదిలినట్టుగా ఆ స్కూటరు చలన సంగీతం ఆరంభించింది

గర్వంగా భార్యవేపు చూస్తూ, "ప్రొద్దుట్నించీ స్టార్ట్ చెయ్యలేదు కదూ—అందుకనీ ట్రబుల్! మన స్కూటరు మనల్నెప్పుడూ లెట్ డౌన్ చెయ్యదు" అన్నాడు అంటూ ఎక్కి కూచుని, క్లచ్ మారుస్తూ "ఊఁ! కూచో! — అవతల టైమయి పోతోంది" అన్నాడు పిలియన్ సీటు ఆఫర్‌చేస్తూ

సుధ, సుతారంగా చీర చెరుగులను ఎత్తిపట్టుకుని, వయ్యారంగా ఒకవేపుకు ఎక్కి కూచుని, భర్త బుజం మీద ఒక చేయివేసి రెండో చెయ్యి స్టెపిన్ మీద వేసి, "ఊఁ! పోనీండి" అన్నది

స్కూటరు మీద వెళ్తూ వెళ్తూ, వంటరిగా గేటు దగ్గర నిలబడివున్న కరుణను ఆమె చూసి నవ్వుతూ విష్ చేసింది ఏదో అనను కూడా అన్నది స్కూటరు శబ్దంలో ఆ మాట ఏమిటో కరుణకు స్పష్టంగా వినబడలేదు స్కూటరు ముందుకు వెళ్తుంటే, సుధ కట్టుకున్న జరీపూల ఎర్ర చీర చెంగు, జయపతాకలా ఎగురుతూ కనిపిస్తోంది సుధ తలలో పెట్టుకున్న ఒకే ఒక ఎర్రగులాబీ, ఇంత దూరానికి గూడా నల్లని ఆకాశంలో వంటరి జ్వాలా నక్షత్రంలా మెరుస్తూ కనిపిస్తోంది సుధ రాసుకున్న అత్తరు పరిమళం, విసురుగా వచ్చిన గాలి కెరటంతో కలిసి గుండె లోతులను స్పృశిస్తోంది

కరుణకు, ఇదమిద్ధమని తెలీని కారణంతో, మనస్సు చివుక్కుమంది సుధాకరం, తన భర్త ఇద్దరూ కాలేజీలో లెక్చరర్లే! ఇద్దరూ ఒకసారే చేరారు సర్వీసులో! తామూ, సుధా కూడా ఒకసారే కాపురాలకు వచ్చారు

అయితే ఏం, తన జీవితం ఉన్నచోటే వుంది

సుధాకరం, తానంతవరకూ అద్దెకుంటున్న ఆ ఎదుటింటిని స్వంతం చేసుకున్నాడు ఇల్లు కొనీ కొనకుండానే స్కూటర్ కొన్నాడు. స్కూటరు వచ్చీ రాకుండానే, భార్యతో కలిసి సరదాగా అక్కడికీ ఇక్కడికీ వెళ్లివస్తున్నాడు!!

ఆ క్షణంలో కరుణకు—

సుధాకరం ఉదయం నాలుగ్గంటల కనగా లేచి బ్యాచీ తర్వాత బ్యాచికి వరుసగా ట్యూషన్లు చెప్పడం జ్ఞాపకం రాలేదు

అతనికి భార్య తరఫున కలిసిన సుక్షేత్రమైన తణుకు పంటపొలం జ్ఞాపకం రాలేదు అటు పెళ్ళిచేయవలసిన చెల్లెళ్లు కానీ, ఇటు పోషించవలసిన వృద్ధ తలిదండ్రులు కానీ అతనికిలేని విషయం ఆమెకు అసలుజ్ఞాపకమే రాలేదు

సుధాకరం ఎంతో సమర్థుడుగా, ప్రయోజకుడిగా కనిపించాడు! మన్మధ జీవితంలో అన్నీ పోగొట్టుకుంటూ, ఏమీ సాధించలేకున్న అమాయకుడుగా కనిపించాడు

ఓ సంవత్సరం క్రితం—

సుధాకరం దంపతులు సమధికోత్సాహంతో గృహప్రవేశం జరుపుకున్న రోజున, తనకూ మన్మధకూ జరిగిన సమాధానం, అనుకోకుండా ఆ సమయంలో ఆమెకు జ్ఞాపకం వచ్చింది

"మనమూ ఇల్లు కొనుక్కుందామండీ!"

"కరుణా!" మన్మధ కంఠస్వరం బరువుగా ధ్వనించింది "ఇంటి సంగతి దేవుడెరుగు ముందు అనూరాధ పెళ్లి చేయాలి! ఎట్లాగా అని, నాన్నకూ, నాకూ కూడా ఒకటే ఇదిగా వుంది!"

కరుణ కాసేపు మౌనంగా వూరుకొంది "పోనీ—మీరుకూడా ట్యూషన్లు చెప్పకూడదుటండీ?" అన్నది

"చెప్పను"

మన్మధ గొంతులో విచిత్రమైన నిశ్చయం "ఇంటిదగ్గర ట్యూషన్లు చెప్పడం కోసమని కాలేజీలో పాఠాలు చెప్పకుండా, విద్యార్థులను మోసగించడం ధర్మద్రోహం యూనివర్శిటీ చెప్పకూడదన్నది కాలేజీ గవర్నింగ్ బాడీ వద్దంది డిసిప్లిన్‌కు వ్యతిరేకంగా నడవడం నా వల్లకాదు"

"ఎదురింటి సుధాకరంగారు చెప్పడం లేదేమిటీ?"

"సాగినంతకాలమే సాగుతుందన్నది అతని మనస్తత్వం ఇటు ట్యూషన్లూ చెప్పగలడు అవసరమొస్తే అటు సెక్రటరీగార్ని ఆశ్రయించనూ గలడు ఆ పన్లేవీ నేను చెయ్యలేను కరుణా! ఐయామ్ సారీ! అన్యాయార్జిత విత్తంతో మేడల్లో నివసించడం కన్నా, న్యాయంగా సంపాయించిందాంతో గుడిసెల్లో వుండడం మేలని నా అభిప్రాయం" కరుణ తన భర్తతో వివాదానికి దిగలేదు ఆదర్శాలను నమ్ముకున్న మనిషితో వివాదపడిమాత్రం లాభమేవిటీ? అయితే ఆదర్శాల కోసమని జీవితంలో చిన్న చిన్న సుఖాలను కూడా వదులుకోవాలా అన్నదే ఆమెకు అర్థంకాని విషయం



# ఉత్తమ సాగుపద్ధతులను పాటించి లభ్యమయిన ఎరువులను సక్రమముగా వినియోగించండి!



## లభ్యమైన ఎరువులతో అధికోత్పత్తికి ముఖ్యసూచనలు

ఎఫ్ సి ఐ వారి పరిశీలనా కేంద్రములో భూసార పరిశీలన "ఉచితము" గా చేయించుకొనండి

మీ ప్రాంతమునకు సిఫారసు చేయబడిన ఆధునిక మరియు సంకరజాతి రకములను సాగుచేయండి ఇవి ఎరువుల మోతాదు తక్కువ అయినప్పటికి స్థానిక రకములకంటె ఎక్కువ దిగుబడి నివ్వగలవు

దుక్కి మొదలు చేను కోతవరకు సిఫారసు చేయబడిన తగు ఉత్తమ సాగుపద్ధతులను పాటించండి చౌడు భూములకు జిప్సమ్ ను వాడి ఎరువుల వినియోగతను పెంచండి





* పచ్చిరొట్ట పశువులపెంట సేంద్రియపు ఎరువులు ఎక్కువ మోతాదులలో వాడండి
* లభ్యమైన ఎరువులను సాధ్యమైనంత హెచ్చు విస్తీర్ణములో వేసి ఎరువులు వృథాకాకుండా చూడండి నత్రజని మరియు సంకీర్ణ ఎరువులను సరియైన కాలములో ఉత్తమ పద్ధతులాచరించి వేయండి
* విత్తనశుద్ధి సస్యరక్షణ కలుపు మొక్కల నివారణా పద్ధతులను తగు సమయములలో పాటించండి
* సిఫార్సు చేయబడిన పద్ధతుల ననుసరించి నీటి వినియోగతను పెంపొందించండి
* పైరుకు జింక్ మొదలగు ఉపపోషక పదార్థముల లోపము లేకుండా చేయండి
* వాతావరణములోని నత్రజనిని భూమికి అందించి భూసారమును వృద్ధిచేయుటకు ఎల్లిపెసర మొదలగు మధ్యస్థపంటలను పండించండి
* వివరములకు వ్యవసాయ విస్తరణాధికారినిగాని ఎఫ్ సి ఐ వారి స్థానిక ప్రతినిధిని గాని సంప్రదించండి





**ది ఫెర్టిలైజర్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా లిమిటెడ్**

(కేంద్రప్రభుత్వ యాజమాన్య సంస్థ) మార్కెటింగ్ విభాగము

**ఆంధ్రప్రదేశ్ రీజనల్ ఆఫీసు**

5-10-178 ఫతేమైదాన్ రోడ్ హైదరాబాదు-500 004

# మధ్యతరగతి మధురస్వప్నం

తనదీ అన్న ఓ స్వంత గూడు వుండడం—

వాళ్లమీదా వీళ్లమీదా ఆధారపడకుండా ఓ స్వంత వాహనముండడం—డన్‌లప్ పరుపు పైన స్ప్రింగ్ కాట్ మీద పడుకుని వెచ్చగా భర్త పరిష్వంగంలో కరిగిపోవడం—

మండు వేసవిలో ఎండనపడి వచ్చినప్రాణానికి ఇంత చల్లని మంచి తీర్థమివ్వడానికి వో మినీఫ్రిజ్—

వో సీలింగ్ ఫ్యాన్, వో సోఫాకమ్ బెడ్, వో గాద్రెజ్ బీరువా, ఇవన్నీ ఈ ఇరవయ్యో శతాబ్దపు ఉత్తరార్థంలో ఎవరైనా కోరుకోదగిన కనీస సౌకర్యాలు కావా?

మన్మథ దృష్టిలో కావు.

తన దృష్టిలో అవును.

ఈ ఉత్తర దక్షిణ ధృక్పథాల మధ్య సయోధ్యకు తావులేదు. ఎవరో ఒకరు పూర్తిగా తన స్వభావాన్ని మార్చుకోవాలి. తనే మార్చుకుంది. కానీ అప్పుడప్పుడు తనలో తనకే బాధ కలుగుతుంటుంది.

ఇప్పుడు తన భర్త తన చెల్లెలి కోసమని తన జీవితంలోని ఆనందాన్ని త్యాగం చేస్తున్నాడు. రేపు ఆ చెల్లెలు పెళ్లై వెళ్లిపోయింతర్వాత వృద్ధులైన తలిదండ్రుల కోసమని మళ్లీ తన సుఖాన్ని త్యాగం చేస్తాడు. ఆ తర్వాత తమకు పుట్టే పిల్లల కోసమని తన ఆనందాన్ని కొంత త్యాగం చేస్తాడు. ఇట్లా త్యాగంతో, సేవాభావంతో ఆ జీవితంలో ప్రథమార్థమంతా గడచిపోతే ఉత్తరార్థంలో ఇంకా అతను సుఖపడేదేమిటి ? — తనను సుఖపెట్టేదేమిటి ? ...

ఈ రకమైన ఆలోచనల సాలెగూటిలోంచి ఆమె బయటపడక ముందే, మన్మథ మెల్లగా సైకిలు మీద వచ్చి ఉస్సురంటూ ఆమె ముందు దిగాడు. దిగుతూనే, "వెధవ సైకిలు, వెధవసైకిలని! టైరు పంక్చరైంది దారిలో. పంక్చరదీ వేయించుకుని, ఎంత తొందరగా వద్దామన్నా ..." అంటూ ఆగిపోయాడు క్షమాపణ చెప్పుకొంటున్నట్లు. అతనుమాట పూర్తి చెయ్యలేదు. కరుణ అతనివేపు జాలిగా చూసింది. అతని జుట్టంతా చెదిరిపోయింది. మొహం నిండా చెమట పట్టింది. సైకిలు తొక్కడంతో ప్యాంటు మడతలు నలిగిపొయ్యాయి. ఆయాసంతో మనిషిలో కొంత వగర్పు. స్కూటరు మీది సుధాకరం ఒక్కక్షణం ఆమె కళ్ళల్లో

మెదిలాడు. స్కూటరుమీద అతను రాజ కుమారుడిలా వెలిగిపోతున్నాడు. సైకిలు మీద తన భర్త బికారిలా ఉస్సురంటున్నాడు.

"బాగా ఆలస్యమైపోయింది కదూ ?— టిక్కెట్లు దొరకవేమో !"

"పోనీలెండి — రేపు వెళ్దాం !"

సైకిలు లోపల పెడుతున్న మన్మథ తల అడ్డంగా తిప్పాడు "వద్దు వద్దు ఇవ్వాళే వెళ్దాం. టిక్కెట్లు దొరక్కేం ?— ఈ సినిమా వచ్చి అప్పుడే మూడోవారం కూడానూ !"

తనను నిరాశపర్చకూడదని అట్లా అంటున్న భర్తను చూసిన కరుణ హృదయం అతని మీది అభిమానంతో ఆర్ద్రమైంది. అతన్ని ఆ సమయంలో అపవారించడం ఇష్టం లేక, "సరే అయితే ! తొందరగా టాయిలెట్ కండి !" అన్నది ఉత్సాహంతో.

"ఎంత ?— వన్ మినిట్ !"

అన్నట్టుగానే ఒక్క నిముషంలోనే మన్మథ తయారై వచ్చినా, వాళ్ల రిక్షా మాట్లాడు కుని, థియేటరు చేరుకొనేసరికి ఓ అరగంట పట్టింది. ఎక్కడో ఊరవతల వుంది ఆ సినిమాహాలు. అప్పటికే బుక్కింగ్‌ దగ్గర క్యూ వల్చబడింది. హాలుబయట తినుబండా రాల వాళ్ల ధ్వనులు తగ్గుస్థాయిలో వున్నాయి.

మన్మథ రిక్షా దిగి కౌంటరు వేపు అడుగు వేసేటంతలోనే, కౌంటరు మూసేసి "హాలు నిండినది" అన్న బోర్డు తగిలించారు బయట గేటుకు

కరుణ రిక్షాలోంచి దిగనే లేదు. ఆమె మనస్సు భారమైంది. ఏదో చెప్పలేని వెలితి.

"మనం ఇంకొంచెం ముందు రావలసింది కరుణా !"

కరుణ మ్లానంగా నవ్వింది. "సరేలెండి ! రండి. ఇంకా ఎందుకూ ఇక్కడ ? ఈ రిక్షా లోనే ఇంటికి పోదాం !"

మన్మథ తప్పు చేసిన వాడిలా రిక్షా ఎక్కాడు. అతను రిక్షాలో కూచున్న తర్వాత రిక్షా వెనక్కు తిరిగింది. ఒకటి రెండు గజాలు కూడా అది నడవకుండానే సినిమా థియేటరు సమీపంలోనే వాళ్లకు సుధాకరం స్కూటరు మీద వస్తూ ఎదురైనాడు. మన్మథను చూస్తూనే స్కూటరు ను స్లోచేస్తూ, "హలో ! ఏం వచ్చేస్తున్నారు ? టిక్కెట్లు దొరకలేదా ?" అని అడిగాడు.

అవమానానికి తోడు గాయాన్ని కూడా జత చేయడం అంటే ఇదేకామోసు !

"హౌస్ ఫుల్"

"మాకు తెలుసు అందుకనే ముందు ఇక్కడికి వచ్చి, టిక్కెట్లు తీసుకుని ఆ తర్వాత మధులతకు వెళ్లి ఇట్లా వస్తున్నాం. అయినా మీరొస్తున్నట్టు ముందుగా మాకు ఇన్‌ఫారమ్ చేసినట్లయితే మీక్కూడా టిక్కెట్లు తీసుకొనేవాణ్నిగా ! — వెనగ్గా మీరు రిక్షాలో వచ్చినా ఇబ్బంది లేక పోయేది !"

'రిక్షాలో వచ్చినా' అంటే ఆ మాటలో గల అంతరార్ధమేమిటో !" అడగాలనిపించినా అడగలేక వూరుకొంది కరుణ.

అయినా తనకు తెలుసు. వాళ్లు స్కూటరు వాళ్లు ! ఎక్కడైనా తిరగ్గలరు. అన్నిపనులూ క్షణంలో పూర్తి చేసుకోగలరు.

తామంటే సైకిలు వాళ్లు. రిక్షాలో తిరుగుతూ, ఒకరి మీద ఆధారపడే వాళ్లు ! "దట్సాల్ రైట్ !" అన్నాడు మన్మథ, తన కో లెక్చరర్ మాటలను తేలిగ్గా తీసుకుంటూ.

ఇంటికి వచ్చింతర్వాత కూడా కరుణ ఇంకా ఆ మాటలనే పునశ్చరణ చేసుకో సాగింది.

తాము సైకిలువాళ్లు !! ఎల్లకాలం తాము సైకిలు వాళ్లమేనా? సైకిలు క్లాసు నుండి స్కూటర్ క్లాసుకు, స్కూటరు క్లాసు నుండి కార్ల క్లాసుకు తాము ఎదగలేమా ? తోటి వారిలో తమ అంతస్థు పెంచుకోలేమా ? జీవితంలో కొంచెం సుఖాన్నయినా చవి చూడ లేమా?

"ఏమిటి కరుణా—ఆలోచిస్తున్నావ్ ?" అన్నాడు మన్మథ ఆ రాత్రి కరుణ అన్యమనస్కంగా వుండడం చూసి.

"ఏమండీ ?" దూరంగా పడుకున్న కరుణ అతనికి దగ్గరసా జరిగింది.

"ఏమిటి ?"

"మనంకూడా వో స్కూటర్ కొనుక్కుందామండీ ?" మన్మథ బిగ్గరగా నవ్వేడు "ఇంపాసిబుల్ ! ఇసుకలో తైలాన్ని తీయడ మన్నా సులభమేమో కాని, ఇమీడియట్‌గా స్కూటరు కొనడం మాత్రం కాదు"

"ఏం ? ఏందుకు కాదూ ?" కరుణ లేచి కూచుని రెట్టించింది.

"ఓసి పిచ్చిదానా ! ఇవ్వాళ నువ్వు స్కూటర్‌ను బుక్ చేసుకుంటే, అది నీ కొడుకు పెళ్లినాటికైనా నీకురాకపోవచ్చు!"

"ఏం తమాషాగా మాట్లాడతారండీ ?

## ప్రధాని ఇందిరా గాంధీ



లినోకట్ చిత్రం. చిత్రకారుడు వేలూరి రాధాకృష్ణ

అందరూ కొనుక్కోవడంలేదా ? వాడు కోవడంలేదా ?"

"వాళ్లంతా నల్ల బజారులో కొనుక్కుంటూండవచ్చు"

"మనమూ అక్కడే కొనుక్కుందాం"

"తెల్ల బజారులో కొనుక్కునే తాహతే మనకు లేదు ఇంక నల్ల బజారు దాకా మనమేం వెళ్లగలమూ ?"

"తాహతెందుకు లేదూ ? — మహా అంద రికీ వున్నట్టు ! ! తాహతు వున్నవాళ్లే కొం కుంటున్నారేమిటి ? అదో సరదా ! ! మకే సరదాలూ లేవు మీదో యాంత్రిక జీవితం"

కరుణ గొంతు గద్గదికమైంది

"నెలకు అయిదారొందలు సంపాయిస్తున్నారు. బయట, లెక్చరర్ అంటే ఎంత హోదా, ఎంత గౌరవం ? ఒక్క స్కూటర్ కొనుక్కోలేమా మనం ? మా వూళ్లో నేతి కొట్టు వీరస్వామి కొన్నాడు హైదరాబాదులో ఎంచక్కా ఆడవాళ్లూ, మగవాళ్లూ స్కూటరు మీద తిరుగుతారో ! మన వూళ్లో కూడా ఇప్పుడిప్పుడే ఇట్లా తిరుగుతున్నారు మీరు ముందు కూచుని రివగా స్కూటర్ డ్రైవ్ చేస్తుంటే, నేను వెనగ్గా కూచుని, మీ నడుంచుట్టూ చేయివేసి .." చెప్పడం ఆపేసింది కరుణ.

"అందమైన ఆ కలను ఆసాంతం చెప్పు కరుణా ! మధ్యలో ఆపకు" మన్మథ ఆమెను దగ్గరకు పొదువుకుని ప్రేమగా అడిగాడు

"ఆ కలను నిజం చెయ్యరూ ?" అంది

చెవిలో మురిపెంగా పలికింది కరుణ మన్మథ బరువుగా నిట్టూర్చాడు "నిజం చెయ్యాలనే నాకూ వుంది కరుణా! కనీసం వో సెకండ్ హేండ్‌ది అయినా సరే కొందామనే వుంది.

## మధ్యతరగతి మధురస్వప్నం

కానీ ఎట్లా? నెల నెలా నాన్నకు పంపించే డబ్బు పంపడం ఆపేయనా? మా చెల్లెలి పెళ్లి కోసం ఆదా చేయడం మానుకోనా? ఇంట్లో ఆలికి అన్నం పెట డం మానేయనా? ఇంటాయనకు అద్దె చెల్లించడం మానుకోనా? వీటిల్లో ఏదోఒకటి చేస్తేకాని డబ్బువుండదు నా దగ్గర. ఏంచెయ్య మంటావ్?"

కరుణ ఒక్కక్షణం మౌనంగా వూరు కొంది. ఆ తర్వాత మెల్లగా అన్నది "నేనో పని చెప్తే చేస్తారా ?"

"ఏమిటది ?"

"నా నగలిస్తాను అమ్మేస్తారో, తాకట్టు పెడతారో మీ ఇష్టం ఏం చేసినా నాలుగైదు వేలకు తక్కువరాదు అది పెట్టి స్కూటరు కొనండి"

ఆ మాటవినిమన్మథ అవాక్కయిపోయాడు కొంత సేపటికి తెప్పరిల్లుకొని, "ఈ వూహ నీకెందుకు వచ్చింది కరుణా !" అన్నాడు బల హీనంగా కరుణ అతని జుట్టులోకి వేళ్లు పోనిచ్చి దువ్వుతూ ప్రేమగాఅన్నది "ఏమండీ! చెమటలు కక్కుకుంటూ అంతదూరం నుండీ మీరు సైకిలు మీద అట్లా వస్తుంటే నే చూడలేనండీ! మీరు నా కలల యువరాజు మీరు ఎంత ఠీవిగా, ఎంత దర్జాగా వుంటే అంత నాకు ఆనందం సంఘంలో మీ స్టేటస్ ఎంత పెరిగితే అంతనాకు సంతోషం ఒకరి కన్నా మీరెందుకు తక్కువ కావాలి? ఎందులో తక్కువ కావాలి ? మీరు చేస్తున్న త్యాగం విలువ ఎంతటిదో ఎవరికితెలుసు?—నాకు తప్ప! రేపు మీ చెల్లెలు పెళ్ళిచేసుకుని ఒక ఇంటికి వెళ్లిపోతుంది అప్పుడామెకు మీరుపడ్డ శ్రమ జ్ఞాపకం వుండదు అప్పుడు మీరు సుఖపడ దామన్నా, నేను మిమ్మల్ని సుఖపెడదామన్నా కాలం మనకు అనుకూలం కాదు గదా! అట్లా అని మీ మంచి తనాన్ని మీరు పోగొట్టుకోవద్దు మీ త్యాగం చేయడం మీరు మానుకోవద్దు మీరు ఇతరుల కోసమే కష్ట పడండి మీ కోసం మాత్రం కొంచెం నన్ను కష్టపడనీయండి. అది చాలు నాకు! ఆ కొంచెం కష్టంలోనే, ఆ కొంచెం త్యాగం లోనే నాకు మనశ్శాంతి !!" ఆమె మాటలు విన్న మన్మథకు ఏమని జవాబు చెప్పాలో తెలియలేదు. "కరుణా!" అంటూ ఆమెను గాఢంగా గుండెలకు హత్తుకున్నాడు అతని కను కొలకుల చిందిన బాష్ప బిందువొకటి ఆమె వక్షస్సుపై జారిపడింది.

* * *

స్కూటరుమీద దిగిన కూతుర్ని అల్లుణ్ణీ చూసి జగన్నాథం దంపతులు పొంగిపోతూ సాదరంగా లోపలకు ఆహ్వానించారు.

"ఏం బావగారూ, ఇది బజాజా, లాంబ్రెట్టానా, రాజ్‌దూతా, మోపెడా ?" అంటూ ప్రశ్నలతో వయసులో చిన్నవాళ్లైన బావమఱదులు మన్మథను వేపుకుతిన్నారు

"దీని హార్స్ పవర్ ఎంతండీ? పెట్రోలు లీటరు ఎన్నిమైళ్లు వస్తుంది ?" అంటూ కొంచెం పెద్దవాళ్లు ఆసక్తితో ప్రశ్నించారు.

"బావగారూ ! వెనకాల కూచో పెట్టుకుని మమ్మల్ని ఊళ్ళోకి తీసుకువెళ్లరూ?" అంటూ మఱదళ్లు కుతూహలంగా అర్థించారు

"ఉండండర్రా! అతన్ని కాస్త విశ్రాంతి తీసుకోనీండి" అంటూ జగన్నాథం పిల్లలను కసిరేవరకూ మన్మథకు ఆ తాకిడీ అల్లాగే వుండిపోయింది

తనభర్త చుట్టూచేరి పదిమందీ కాంక్షా నేత్రాలతో, ఆత్రుతగొన్న హృదయాలతో, ఆరాధనా కంఠాలతో అట్లా అడుగుతుండడం




చూసి కరుణ గర్వంగా మన్మథ వేపు చూసి లోపలకు వెళ్ళింది

ఆ అనుభవం మన్మథకు కొత్తగా వుంది ఒక్కసారిగా తానెంతో ఎత్తుకు ఎగిరిన ట్లుంది

ఆ సాయంకాలం అతను, పిల్లలను కొంచెం సేపు స్కూటరుమీద కూచో పెట్టుకుని బజారులో తిప్పి తీసుకువచ్చాడు భార్యతో కలిసి సినిమాహాలుకు బయలుదేరుతూ, "ముందస్తుగా మేం వెళ్తున్నాం వెనగ్గా మీరు రండి !" అన్నాడు.

మన్మథతో కలిసి స్కూటరు వెనుక సీటు మీద కూచుని, గాలిలో తేలిపోతూ, భర్త బుజాలు ఆసరాగా ముందుకు ప్రయాణం చేస్తున్న కరుణకు అంతకన్నా తన జీవితానికి మరే సార్థకతా అక్కరలేదనిపించింది తను చేసినపని ఎంతో ఉదాత్తమైన దనిపించింది

కాని అంతటి ఉదాత్తభావమూ ఆ రాత్రి తల్లిదండ్రులు అడిగిన ప్రశ్నలకు నీరు కారి పోయింది

"ఏమే కరుణా! పొద్దుటినుంచీ చూస్తున్నాను అదేమిటే — నీ మెడ అట్లా బోసిగా వుందీ ?" అని అడిగింది ఆమె తల్లి అరుంధతమ్మ కరుణ ఏదో చెప్పాలని నోరు తెరిచింది ఏం చెప్పాలి? అబద్ధమా? నిజమా?

"అమ్మాయ్ చేతుల్ని గాజులు కూడా కన బడడం లేదే ?" అన్నాడు జగన్నాథం తానేదో కొత్త విషయాన్ని కనుక్కొన్నట్లుగా

అరుంధతమ్మ, కరుణ చేతుల వేపు చూసింది కరుణ చెవుల వేపు చూసింది. కరుణ మెడవైపు చూసింది కరుణ వైపు ఆశ్చర్యంగా, అనుమానంగా, నిందా దృక్కులతో చూసింది.

"ఈ దిగదుడుపు రూపమేమిటే ? పెళ్లి నాడు మేమూ, మీ అత్తగారూ పెట్టిన నగలన్నీ ఏం చేశావ్ ?"

కరుణ తల్లి వైపు నిశ్చలంగా చూసింది. నింపాదిగా అన్నది "స్కూటర్ కొన్నాం !"

ఆ మాట వినగానే అల్లుడి మీద ఆమె అంతవరకూ పెంచుకున్న గౌరవం ఒక్క సారిగా క్రిందకు దిగజారిపోయింది

"ఇదేమిటే? నిక్షేపంలాంటి నీ నగలుతీసుకు వెళ్లి వో ఇనపముక్క మొహాన పెట్టాడా అల్లుడు? ఇంత తెలివితక్కువ వాడనుకో లేదే నేను!" అన్నది ఈసడింపుగా

"ఏమైనా తాను సంపాయించిందాంతో ఇటువంటి పనులు చేయాలి కానీ ఆడదాని సొమ్ముతో తాను షోకు చేసుకోడం ఏం బాగో లేదు" అన్నాడు జగన్నాథం పైమీది కండువా దులిపి బుజాన వేసుకుని అక్కణ్నుంచి లేచి పోతూ.

అప్పుడే లోపలకు వచ్చిన మన్మథ "ఏమిటండీ బాగోలేదంటున్నారూ ?" అంటూ వాళ్ల దగ్గరకు వచ్చాడు

"నాన్నా ! మన స్కూటరు ఎంత మెత్తగా పోతోందో తెలుసా ? దార్లో ఎన్నింటిని ఓడించేసిందో ?" అంటూ లోపలకు అత్యుత్సాహంగా వచ్చిన కరుణ చిన్న చెల్లెలు తన అక్క మొహంలోని బాధనూ అసహ్యాన్నీ గమనించి అట్నే నిల్చుండి పోయింది

"అమ్మా! మీ అల్లుడిగారికి స్నానానికి నీళ్లు తోడదాం పద !" అన్నది కరుణ అక్కడినుంచి లేచిపోతూ

"అట్లాగే పద తల్లీ! పోయిన

# మధ్యతరగతి మధురస్వప్నం

నగలెట్లాగూ రావు కదా, వాటిని గురించి ఇంకా చర్చ కూడా ఎందుకులే!" అంటూ అరుంధతమ్మ కూతురితో కలసి లోపలకు వెళ్లిపోయింది.

మన్మధ తన మామగారిని ఏదో అడగబోయాడు. ఆయన ఏమందంటూ ప్రక్కకు తప్పుకున్నాడు. ఆ ఇంట్లో వాతావరణం ఒక్కసారిగా మారిపోయినట్లనిపించింది అతనికి. చూచాయగా అది తన భార్య నగల గురించి అని కూడా అర్థమైంది. దాంతో అతని మనస్సు చివుక్కుమంది. అవి తమ నగలు! తామేం చేసుకున్నా ఇతరులు, వారెవరైనా కానీ, తమను ప్రశ్నించడానికి వీలులేని నగలు!!

భోజనం చేశాననిపించి, మంచం మీదకు చేరాడు. కొంచెం సేపటికి మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ అక్కడకు వచ్చిన కరుణ మరొకరికి వినిపించనంతటి మెల్లగా, అతనితో "క్షమించండి. నా మూలంగా మీకు అవమానం జరిగింది." అన్నది. డగ్గుత్తికతో.

మన్మధ చివాలున తలెత్తాడు. కరుణ కళ్ళలో నీళ్లు. "రేపొద్దున్న ఇక్కణ్నుండీ మనం వెళ్ళిపోదామండీ!" అన్నది బాధగా.

"అట్లాగే వెళ్ళిపోదాం. దాన్ని గురించి నువు బాధపడకు." అన్నాడు మన్మధ తన మనసులోని బాధను దాచుకుంటూ.

మర్నాడు స్కూటరు మీద ప్రయాణమైన కరుణను, మన్మధనుచూసి, "అప్పుడే వెళ్లిపోతున్నారేం!" అన్నారు జగన్నాధం దంపతులు పొడిగా.

"వెళ్లాలండీ — సెలవులేదు!"

సెలవు లేదంటూ ముందుకు వెళ్ళిపోయిన ఆ ఇద్దర్నీ చూసి జగన్నాధం దంపతులు ఎంత నిర్లిప్తంగా వూరుకున్నారో, సెలవు లేకుండా, అనుకోకుండా తమ ఇంటికి వచ్చిన కొడుకునూ, కోడల్నీ చూసి పరంధామయ్య దంపతులు అంత ఆశ్చర్యపడ్డారు

వస్తూనే, "నాన్నా! స్కూటరు కొన్నాను బావుందా?" అన్నాడు మన్మధ తండ్రివంక చూస్తూ

"ఎందుకు బావుండదూ? ఎంతపోసి కొన్నావేవిటీ?" అన్నాడు పరంధామయ్య ప్రశ్నార్థకంగా

"బ్లాక్‌లో కొనాల్సి వచ్చింది నాన్నా! అయిదువేలకు పైనే అయింది"

"అయిదువేల" అనాడి అపూర్వ ... పార్వతమ్మ వంతయింది" "ఆ అయిదువేల తోనూ అక్కకి కళ్యాణం సామ్మ తీరిపోయేది!"

మన్మథ మనస్సు ఆ మాటతో చిన్న బోయింది తను స్కూటరు కొన్నందుకు తన తల్లీ, తండ్రీ ఏమాత్రంకూడా సంతోషించడంలేదా ?

రాత్రి భోజనాల దగ్గర మళ్లీ ఆ ప్రస్తావన రానేవచ్చింది

"ఏరా, స్కూటరూ అదీ కొనుక్కున్నావ్, బాగానే వుంది అనుభవించాల్సిందే! కాదనను కాస్త నీ చెల్లికి ఆ మూడు ముళ్ళూ కూడా తొందరగా వేయించేస్తే "

"అలాగే చూద్దాం నాన్నా!"

"చూద్దాం అంటే కాదురా, నీ దగ్గర డబ్బు నిల్వ వుండేట్టు నాకు తోచదు అల్లా, పెళ్లి అనా వాయిదా వేస్తున్నావ్! నిన్ను చూస్తే నాకు ఇదివరకున్న ధైర్యం ఇప్పుడు తగ్గిపోతోందిరా!"

మన్మథ హృదయం భగ్గుమంది చివాలున తండ్రి వైపు తలెత్తి చూశాడు తల్లి వైపు చూశాడు ఆమె పెళ్ళి కావలసిన కూతురివైపు చూస్తోంది మన్మథ తలుపు దగ్గర నిలబడ్డ తన చెల్లెలి వైపు చూశాడు "ఇట్లా ఎందుకు చేశావ్ అన్నయ్యా ?" అంటున్నాయి ఆ కళ్ళు

భోజనాల తర్వాత, ఆరుబయట తండ్రీ కొడుకులు పిచ్చాపాటీ కబుర్లు చెప్పుకుంటూ కాసేపు కూచున్నారు మన్మథ, ఎంతగానిండు కుండలా వుందామని ప్రయత్నంచేసినా, అతని గుండెలో తెలియనికసి ఏదో భగ్గుమంటోంది

మధ్యలో మంచినీళ్ల కోసమని మన్మథ లోపలకు వచ్చినప్పుడు, అతనికి వినిపించిన అతని తల్లి మాటలు అతణ్ణి నిశ్చేష్టుణ్ణి చేశాయి

"అది కాదు కరుణా! నీ నగలన్నీ అమ్మి, తను స్కూటరుకొనుక్కునే ఖర్మం పట్టిందే నా కొడుక్కి ? లక్షణంగా అయిదొందలు తెచ్చుకుంటున్నాడు అడిగిన వాళ్లకు అడిగినంత ఇవ్వగలడు నాబిడ్డ! వాడెక్కడ మా అందరికీ తప్పి తలకెత్తుతాడో అని ముందస్తుగా ఇది నువ్వు ఆడుతున్న నాటకంకాదు గదా! రేపొక వేళ నీ ఆడబిడ్డ పెళ్లికోసమని మే మేదన్నా సాయం అడిగితే 'అయ్యో! నా నగలే అమ్మి ఆయన ఆస్కూటరు కొనుక్కున్నారండీ — ఆయన దగ్గర డబ్బెక్కడుందండీ ?' అన డానికి కాదుగదా ఈ నాటకం ?"

"అత్తగారూ!"

"అత్తగారూ, బండలూనూ! ఎప్పుడూ ఇటువంటి కబుర్లు చెప్పి, మా పరువూ మా బిడ్డ పరువూ బజారుకెక్కించకు తల్లీ!"

కన్నీళ్లతో బయటకు వస్తోంది కరుణ

ఆమె మొహం చూడటానికి సిగ్గువేసింది మన్మథకు తటాలున తలుపు ప్రక్కకు తప్పుకున్నాడు

మరునాటి ఉదయం కరుణ నిద్రలేచేసరికే మన్మథ పట్నానికి వెళ్లిపోయాడు "నన్ను తీసుకు వెళ్లకుండా, నాతో చెప్పకుండా ఎందుకు వెళ్లారూ ?" అని అడిగింది కరుణ, తనకు కనిపించిన ఆ ఇంట్లో వాళ్లందర్నీ! గానీ ఎవరు మాత్రం ఆమెకు ఏం సమాధానం చెప్పగలరూ ? ఎవరికి తెలుసూ ? — మన్మథ పట్నంలో తన స్కూటరు అమ్మేయడానికి ప్రయత్నం చేస్తున్నాడని ?

# ప్రశ్నావళి

—కె రామలక్ష్మి

జ్యోతిశ్రీ, గుంటకల్

దేశంలో కొరతలేనిది దేనికి ?

★ సంతానోత్పత్తికి!

బి జి ఆర్ ఆర్ కర్నూలు

స్త్రీ యొక్క శారీరక పవిత్రతపై పురుషునికి వున్న పట్టింపు పురుషునిపై స్త్రీ కంతగా వుండదెందుకు ?

★ ఉండదని ఎవరు చెప్పారు మీకు? భర్త అడ్డమైన తిరుగుళ్లు తిరిగినా కిమ్మనక పడివుండినంత మాత్రాన — అవన్నీ ఒప్పుకున్నట్లు లెక్క కాదయ్యా! ఇంకో దారి లేక! అందుకే స్త్రీకి ఆర్థిక స్వామత వుండాలని అనడం.

వ్యభిచార బుద్ధి పురుషునిలోకన్నా స్త్రీలకే ఎక్కువ అంటాను ?

★ కాని ప్రతి వ్యభిచార స్త్రీ ప్రక్కనా ఓ పతనమైన పురుషుడు వుంటాడన్న సత్యాన్నికూడా—గుర్తించమంటాను!

సి. హెచ్. ఆర్. కొత్త వరంగల్లు

ఆడవారికి అసూయ అనుమానం ద్వేషం ఎక్కువ. అభిమానం తక్కువ.

★ చిత్రం. ఉన్న అభిమానాన్ని పురుషులు చంపేశాక—చేతకాని కోపం, ద్వేషం, అసూయ, అనుమానాలు గాక — ఏముంటాయి ? !

ఎస్. కిరణ్, కరీంనగర్

ప్రేమ లొలకబోసే ఆడదానిలో స్వచ్ఛమైన ప్రేమ వుండదు. అని గుర్తించాను.

★ మరి ఎవరిలో వుంటుందో కూడా రిసెర్చి ప్రారంభించి ఏ యూనివర్శిటీలోనో రిజిస్టరు చేయకూడదా — ప్రేమ మిగలకపోయినా డాక్టరేటైనా మిగులుతుందికదా!

ఎస్ ఆర్ వేంద్ర

సినిమా సాహిత్యానిక్కూడా ఛందస్సు అవసరమా ?

★ అక్కర్లేదు కాని సంగీత దర్శకుని ట్యూనుకి పాటలు (అంటే మాటలు!) రాయగల నేర్పు అవసరం యిక మాటలకి అర్థాల బాధెందుకు ? మీకా బెంగ అక్కర లేదు — ఏ వచనం యిచ్చినా, నినాదం యిచ్చినా సుశీల కమ్మగా పాడేస్తుంది!

పి. ఎస్. ఆర్. రేపల్లె

మనిషి మనుగడపై పరిస్థితుల ప్రభావం ఎంతవరకు వుంటుంది?

★ చుట్టూ వాతావరణానికి అనువుగా సద్దుకుంటూ జీవించడమే — మనుగడ.

కె. పి. ఆర్. సికింద్రాబాదు

దారుణంకంటే దారుణం ఏది ?

★ సభ్యత లోపించిన ఆలోచన!

ఎవరికోసం బ్రతకాలి ?

★ ఒక్కటిమటుకు చెప్పకలను. 'నీకోసం నువ్వు బ్రతికేయడం' అన్నంత ప్రమాదం ఇంకోటి ఉండదు.

ఎస్. కె. కె. హెచ్. వరంగల్

మీ జవాబులు విడవకుండా చదువుతాను — ప్రతి పత్రికలోనివి — దిన దినాభివృద్ధి చెందుతూంది గర్వం మీ జవాబుల్లో...మీరు స్మశానానికి ఎంత దూరంలో వున్నారు ?

★ క్షణ క్షణాభివృద్ధి చెందడం లేదే — అని బాధగావుంది నాయనా! ఇక దీనికి సమాధానం యివ్వడానికి సాహసం వుందా అంటున్నావా పిచ్చి తండ్రీ! యిలాంటి చిన్న విషయాలకి సాహసం ఎందుకు దండగ మా యింటికి శ్మశానం చాలా దగ్గిర నన్ను మనుషులు మోస్తే ఒప్పకోను—'చావుబండి' తెప్పించితే చాలు—రెండు నిమిషాలు!! ఖర్చు తక్కువ!!

కె కె ఎస్ రామభద్రపురం

చెప్పలు మార్చుకోకండి భార్యలను మార్చుకొన్నట్లు అవుతుంది అంటారు గదా పెద్దలు అంటే పురుషుడు స్త్రీకిచ్చే విలువ అంతేనా ?

★ చిత్రం — ఆ పెద్ద లెక్కడున్నారో చెప్పండి — వాళ్ల చేతే చెప్పిద్దాం — చెప్పలు విలువ!

ఎస్. సి. హెచ్. ఆర్. రెడ్డిపాలెం

ప్రశ్నావళి శీర్షికలోని జవాబులు విజ్ఞానదాయకంగా లేవంటాను.

★ మీ అభిప్రాయాన్ని కాదనడానికి నేనెవర్ని సార్! విజ్ఞానం వాసొత్తా ? !

మదర్ థెరిస గురించి మీ అభిప్రాయం ?

★ మూర్తీభవించిన మానవత్వం ఆమె. ఆమె దృష్టి స్వార్టుపురం స్త్రీల కుటుంబాల మీద కూడా పడకూడదా అనిపిస్తుంది నాకు.

పి. వి. కె. ఎస్. మునగపాక

ఒక స్త్రీ ప్రసవించేటప్పుడు పడే బాధ పురుషునికి జీవితంలో ఒక్కసారేనా కల్గుతుందంటారా ?

★ కల్గదు. అది తెలిసివుంటే అంత తాజ్ మహల్ కట్టించిన పెద్దమనిషి భార్య పదునాలుగవ కాన్పులో చనిపోయేది కాదు!

ఆర్ ఆర్ ఆర్ ధర్మసాగర్

అమ్మాయి అందాన్ని చూసి పెళ్లి చేసుకోవాలా ? ఐశ్వర్యాన్ని చూసి చేసుకోవాలా ?

★ ఐశ్వర్యమే బెటరు డబ్బుంటే ఏ అమ్మాయేనా అందంగా వుంటుంది కదూ ? !

పి ఎల్ ఆర్ చినముక్తేవి

ప్రేమించన స్త్రీ మనస్తత్వం తెలుసుకోవా లనిపిస్తుంది ఎందుచేత?

★ బాగుంది వరస మనస్తత్వాలు అర్థం చేసుకున్నాకే ప్రేమించుకోడం జరుగుతుం దనుకుంటున్నానే ?

ఎ. బి. ఆర్. భద్రపూరు

మీకు భర్త అంటే భయం భీతి వున్నాయా ?

★ ఆయనగారేం పెద్దపులా భయపడ్డానికి! భయం భీతి లేవు. యిష్టం వుంది. అంతకు మించిన ఆరాధన వుంది.

ఆడదై పుట్టడం కంటే అడవిలో మానై పుట్టడంపై మీ అభిప్రాయం ?

★ నేను ఆడదానిగానే పుడతాను! మానై పుడితే మగాళ్లని సాధించే ఛాన్సు వుండదు కదా!

కె. ఎస్. ఎస్. గుళ్లదూర్తి

న్యాయానికి నిర్వచనం చెప్పకలరా?

★ న్యాయానికి నిర్వచనం — చాలా ఫ్లెక్సిబుల్. మనకి అన్యాయం అనిపించేది ఎదుటివాడికి చేయకుండావుంటే— న్యాయం చేసినట్టే!





మధ్యప్రదేశ్‌లోని ఉక్కునగరం భిలాయిలో ఆంధ్రులు 10 వేలమంది వున్నారని ఒక అంచనా. వీరంతా రూ. 4 లక్షలదాకా వసూలుచేసి వ్యయపరచి శ్రీ వేంకటేశ్వరస్వామి కోవెల నిర్మించారు. ప్రక్కనే ఒక బహుళ ప్రయోజనకారియైన పెద్ద విశాలమైన సభావేదికను, మందిరాన్నికూడా ప్రారంభించారు. దీనికి, గాలిగోపురం పూర్తి చేయడానికి మరో రూ. 5 లక్షలదాకా కాగలదని భిలాయ్ ఆంధ్ర సాహిత్య సమితివారి అంచనా.

Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIKA